# భగవద్దర్శిని

## (A GUIDE TO 'GOD SPEAKS')

శ్రీ మెహెర్ బాబా

విరచితమగు

"గాడ్ స్పీక్స్" నకు



MASTERY IN SERVITUDE

సంక్షిప్త రచన :

శ్రీ బాలగోపాల భాస్కరరాజు

కళాధ్యాపకుడు

(పరిషదున్నతతర పాఠశాల)

తాడేపల్లిగూడెం.

మెహెర్ కుటీర్

1969

On the occasion of
AVATAR MEHER BABA'S
75 th Birthday
25 th February, 1969



Rs 1 5 /-


Patronised by:
Sri K. M. GANDHI,
'MEHER NIKETAN'
E-39 SHIP YARD COLONY.
Gandhigram,
VISAKHAPATNAM — 5 (A. P.)

Printed by
LAKSHMI PRESS
ELURU.

# - ప్రార్థన -

కల్యాణి రాగం    చతురశ్ర తాళం

ప॥ నమో మెహెర్ బాబా ! అవతార్ !
నమో దేవదేవా ! ప్రభో ! ॥న॥

అ॥ ప॥ అపారదివ్య కృపాసాగరా !
సకల చరాచర జగదుద్ధార ! ॥న॥

1. జోహారులివే శ్రీ మెహెర్ బాబా !
మహిని జనించిన మానవరూపా !
ఇహపరానంద జీవనమీవ,
భవ భయ భంజన పరమపావనా ! ॥న॥

2. అజ్ఞానాంధత నంతముజేసి
దివ్య విజ్ఞానదృష్టి నొసంగి
అరిషడ్వర్గంబంతరింపగా
అవ్యయ మోక్షంబను గ్రహింపుము ॥న॥

—

రచన :
శ్రీ బాలగోపాల రామభద్రరాజు.

ప్రతులు : 1000
జనవరి 1969

"నేను
మేల్కొల్పుటకే
వచ్చితినిగాని
బోధించుటకు
కాదు."

— మెహెర్ బాబా

శ్రీ ఆది కే. ఇరానీ.
గారి సౌజన్యముతో
ప్రచురించడమైనది.

ముద్రణ : లక్ష్మీ ప్రెస్ - ఏలూరు.



"నేను సర్వోత్కృష్టమైన పురాణపురుషుడను."

# ప్రభు సంకీర్తనము

— * —

(THE MASTER'S PRAYER)

ఓ పర్‌వర్‌దిగార్,

సర్వపోషకా! సర్వరక్షకా!

నీవు ఆదియును అంతమును లేనివాడవు. అద్వయుడవు;
నిరుపమానుడవు; నీప్రమాణమెవ్వరును ఎఱుంగనేరరు.

నీవు వర్ణము; నామము, రూపము, గుణములు, లేనివాడవు.

నీవు అపరిమితుడవు, గంభీరుడవు, ఊహాతీతుడవు,
భావనాతీతుడవు; శాశ్వతుడవు, నాశములేనివాడవు.

నీవు అవిభాజ్యుడవు; దివ్యచక్షువులతోగాని నిన్నెవరును
చూడజాలరు.

నీవు ఎల్లప్పుడు నుంటివి, నీవు ఎల్లప్పుడు నున్నావు,
నీవు ఎల్లప్పుడు నుందువు;

నీవు అంతటను గలవు, నీవు అన్నింట నున్నావు:
మరి నీవు అంతటికి అన్నింటికి ఆవలనుందువు.

నీవు ఆకాశమున గలవు, పాతాళమున గలవు;

నీవు వ్యక్తుడవు, అవ్యక్తుడవు; అన్నిభూమికలందున్నావు,
అన్నిభూమికల కతీతుడవు.

నీవు మూడు లోకములలో నున్నావు, ముల్లోకముల కావల
గూడ నున్నావు;

నీవు అగోచరుడవు, స్వతంత్రుడవు.

నీవు సృష్టికర్తవు, ప్రభులకు ప్రభుడవు;
అందరిమనస్సులను, హృదయములను ఎఱిగినవాడవు;

నీవు సర్వశక్తిమంతుడవు, సర్వవ్యాపివి.

నీవే అనంత జ్ఞానము, అనంతశక్తియు, అనంత ఆనందమును.

నీవు జ్ఞానసాగరుడవు, సర్వజ్ఞుడవు, అనంత జ్ఞానివి;
త్రికాలవేదివి, జ్ఞానమే నీవు.

నీవు సర్వ దయాళుడవు, నిత్య శుభంకరుడవు;

నీవు ఆత్మలకెల్ల ఆత్మవు, అనంతగుణ విశిష్టుడవు;

నీవు సత్య, జ్ఞాన, ఆనందముల త్రిమూర్తివి;

నీవే సత్యమునకు మూలము, ప్రేమమహాసాగరుడవు;

నీవు పురాణ పురుషుడవు, సర్వోత్తముడవు;

నీవు ప్రభుడవు, పరమేశ్వరుడవు;

నీవు పరుడవు, పరాత్పరుడవు;

నీవు పరబ్రహ్మవు; అల్లాహ్; ఇలాహి; యజ్దాన్;
అహూరామజ్దా; ప్రియతముడైన భగవంతుడవు.

నీవు "ఈజద్" అనబడు యేకైక పూజ్యుడవు.

—మెహెర్ బాబా.

# కృతజ్ఞతాంజలి

శ్రీ ఆది కే. ఇరాని

శ్రీ కారుమూరి మహాదేవ్ గాంధీ

గార్లకు –

– రచయిత

# పశ్చాత్తాపప్రార్థన.

* 

"ఓమ్ పరబ్రహ్మ - పరమాత్మ"

"యా - యజ్దాన్"

"లా ఇలాహ ఇల్లిల్లాహ్",

"ఓ గాడ్ ! ఫాదర్ ఇన్ హెవెన్ !"

పరమదయానిధివగు ఓ ఈశ్వరా !

మాపాపములన్నిటికిని మేము పశ్చాత్తాప పడుచున్నాము. అసత్యము, అధర్మము, అపవిత్రమును అగు మా ప్రతి తలంపునకు పశ్చాత్తాప పడుచున్నాము.

పలికియుండరాని పలికిన ప్రతి మాటకును, చేసియుండరాని చేసిన ప్రతి చేతకును, మేము పశ్చాత్తాప పడుచున్నాము. స్వార్థముచే ప్రేరేపింపబడిన ప్రతి పనికిని, ప్రతి మాటకును, ప్రతి తలంపునకు.

ద్వేషముచే ప్రేరేపింపబడిన ప్రతి పనికిని, ప్రతి మాటకును ప్రతి తలంపునకు మేము పశ్చాత్తాప పడుచున్నాము.

ముఖ్యముగా -

కామముతో కూడిన మా ప్రతి తలంపునకు, కామప్రేరిత మగు మా ప్రతి చేతకును పలికిన ప్రతి అనృతమునకు,

సమస్త కపట వర్తనమునకు, ఆడితప్పిన ప్రతి వాగ్దానమునకు, సమస్త పరనిందలకు, పరోక్షనిందలకు మేము పశ్చాత్తాప పడుచున్నాము.

ఇంకను ముఖ్యముగా –

పరులకు నాశన మొనగూర్చిన మేముచేసిన ప్రతిపనికిని, ఇతరులకు బాధకలుగజేసిన మే మాడిన ప్రతి మాటకును, చేసిన ప్రతి చేతకును, ఇతరులకు బాధ కలుగవలెనని మేము కోరిన ప్రతి కోర్కెకును, మిక్కిలి పశ్చాత్తాప పడుచున్నాము.

అపారదయానిధివగు ఓ ఈశ్వరా !

మేము చేసిన యీ పాపము లన్నిటిని క్షమింప వేడుచున్నాము.

తలపులలో, మాటలలో చేతలలో, నీ ఇచ్ఛానుసారము చేయజాలక నిరంతరము విఫలులమగుచున్న మమ్ములను క్షమింప వేడుచున్నాము.

మెహెర్ బాబా

8–11–52

———

అవతార్ మెహెర్ బాబా
తన ప్రేమికులకు, శిష్యులకు
ఒసంగిన ప్రార్థన.

హే ! ప్రియతమ భగవాన్ !
మేము నీతో ఐక్యమగునంతటి
అర్హులమగు వరకు
నిన్ను అధికాధికముగా,
అత్యంతాధికముగా
ఇంకను అధికముగా,
ప్రేమించుటకు
మా కందరకు సహాయపడుము;
మరియు
చిట్ట చివరి వరకు బాబా కొంగును
దృఢముగ పట్టుకొని యుండుటకై
మాకందరకు సహాయపడుము.

— ం —



## - స మ ర్ప ణ ము -

— : —

పందొమ్మిది - ఇరవై శతాబ్దముల
వైజ్ఞానికయుగ భగవదవతారుడు
అనంత ప్రేమసాగరుడు
దివ్యప్రియతముడు
శ్రీ మెహెర్ బాబా
పావన చరణారవిందములకు.

# నివేదన.

ఆర్యులారా !

అవతార్ శ్రీ మెహెర్ బాబా రచనలలో నొకటియగు 'GOD SPEAKS' (గాడ్ స్పీక్స్) అను ఉద్గ్రంథమును సంక్షిప్త రూపములో సూత్రప్రాయముగా 'భగవద్దర్శిని' యను నీ చిన్ని పొత్తమందు చిత్రించబడినది.

ఈ భగవద్దర్శిని, ఐదు ప్రధాన ఘట్టములుగా నడచినది, అవి :—

1. భగవంతుడు
2. పరిణామము
3. పునర్జన్మలు
4. ఆధ్యాత్మిక మార్గము
5. భగవంతుడు.

గ్రంథమందలి విషయమంతయు పదిభాగములుగా నుండి, ఆ పది భాగములును భగవంతుని పది పాత్రలుగా పోషింపబడినవి. అనగా, భగవంతుడు శాశ్వతముగా ఏక కాలమందే పది వేర్వేరు పాత్రలను ధరించి నిర్వహించుచున్నాడు.

అవి :

1. పరాత్పర పరబ్రహ్మస్థితిలో భగవంతుఁడు.
2. పరమాత్మ స్థితిలో భగవంతుఁడు.
3. సృష్టికర్తగానున్న భగవంతుఁడు.
4. శరీరిగానున్న భగవంతుఁడు.
5. పరిణామదశలలో భగవంతుఁడు.
6. మానవ రూపములో పునర్జన్మలు పొందుచున్న భగవంతుఁడు.
7. ఆధ్యాత్మిక సాధకులలో భగవంతుఁడు.
8. బ్రహ్మీభూతుఁడైన భగవంతుఁడు.
9. జీవన్ముక్తునిగా భగవంతుఁడు.
10. సద్గురువుగను, అవతారపురుషునిగను ఉన్న భగవంతుఁడు.

ఈ 'భగవద్దర్శిని', మూలగ్రంథమైన 'God Speaks' (గాడ్ స్పీక్స్) యొక్క ప్రతి పేజీ, ప్రతిపేరా, ప్రతివాక్యము, ప్రతిమాటయొక్క సమగ్రమైన కేవల అనువాదము మాత్రము కాదనియు; విషయప్రధానము, భావప్రధానమునైన సంక్షిప్తమగు స్వతంత్రరచనయేనని పాఠకులకు నామనవి.

'గాడ్ స్పీక్స్' యందలి మూలాధార సూత్రములను ఏరి, దివ్య ఇతివృత్తము యొక్క అనుక్రమమునకు భంగము రాకుండ పేర్చి, కూర్చిన ముత్యాలసరము ఈ భగవద్దర్శిని. అందుచేత మూలగ్రంథమందలి విషయానుక్రమమునకును, భగవద్దర్శిని యందలి విషయానుక్రమమునకును సంబంధము లేదు.

మూలగ్రంథములో చివరనున్న విషయములు భగవ ద్దర్శినిలో ప్రారంభమందుండ వచ్చును. అట్లే మూలగ్రంథ ములో ప్రారంభమందున్న విషయములు భగవద్దర్శినిలో చివర నుండవచ్చును. ఏవి యెట్లున్నను, ఇందు వివరించిన భగ వంతుని దశపాత్రల అనుక్రమమే సరియైనది. అందుచేత మూల గ్రంథమందలి మూలాధార సూత్రములను భగవంతుని దశ పాత్రానుక్రమములో మాలగా కూర్చబడినది.

భగవద్దర్శిని ద్వారా, మూలగ్రంథమైన 'గాడ్ స్పీక్స్' ను సులువుగా పాఠకులు ఆకళింపు చేసికొనగలరనెడి విశ్వా సముతో ఈ గ్రంథరచనకు పూనుకొంటిని.

ఈ 'భగవద్దర్శిని' రూపొందుటకును తెలుగు లోకమునకు ఈ కానుక నందించుటకును వలయు సహకార మును తగు ప్రోత్సాహమును ఒసంగిన మెహెర్ ప్రేమిక-కార్య కర్తలైన శ్రీ కారుమూరి మహదేవ్ గాంధి దంపతులు అభి వందనీయులు.

అవతారదర్శన ప్రభావముచే మేల్కొనిన నూతన చైతన్య - శక్తి - అవగాహన - అనుభవములచే ప్రేరేపింప బడి ప్రేమికులై, వివిధరీతులుగా అవతారపురుషునితో సంబంధ మేర్పరచుకొని బంధువులై, గృహస్థ జీవితములో తమ ఉద్యోగ ధర్మములను నిర్వహించుకొనుచు, ఉచితరీతిని అవతార పురు

షుని సత్య - ప్రేమసందేశములను శక్త్యానుసారముగా లోకము కందించు సేవా కార్యక్రమములో తమతమ శక్తి-సామర్థ్యములను, విద్యాపాటవమును, కళాకౌశలమును కాలమును సాధనములుగా వినియోగించుకొని వివిధరీతుల సేవించుచున్న కార్యకర్తలలో శ్రీగాంధీ దంపతులు కూడ ఒకరు.

ఈ 'భగవద్దర్శిని, ప్రచురించుటకు దయతో అనుమతి నొసంగిన అవతార్ మెహెర్ బాబా శిష్యులును, కార్యదర్శియునైన శ్రీ ఆది కే. ఇరానీగారు మిక్కిలి అభివందనీయులు.

జై బాబా !

– భాస్కరరాజు

—

# ఒక మాట.

"భగవంతు డెల్లప్పుడును ఉండెను.
భగవంతు డెల్లప్పుడును ఉండును.
ఆతడెప్పుడును నిర్వికల్పుడే.
మాయాలీలయే ఆతని శాశ్వతఖేల". -మెహెర్ బాబా

అన్ని మతములు 'భగవంతుడు ఉన్నాడు' అనియే చెప్పుచున్నవి, కాని అన్ని దేశములలోను కొలదిమంది మాత్రము భగవంతుడు లేనేలేడు అని వారు నమ్ముటయేగాక, లేడనియే వాదింతురు. వీరు తమకు తెలియకయే, భగవంతుని అస్తిత్వమును పరోక్షముగా మరింత బలపరచిన వారగుచున్నారు.

సామాన్యులు మాటలలో భగవంతుడున్నాడని నమ్ముదురే కాని, వారికి అంతకంటె అనుభవములేదు. ఆధ్యాత్మిక మార్గమందలి సాధకులు అంతర జ్ఞానానుభవముచే విశ్వసింతురు. వారిలో ఉన్నతిస్థాయి నందుకొన్న సత్పురుషులు మాత్రము భగవంతుని ప్రతిచోట ప్రతివారిలో ప్రతివస్తువునందు ప్రత్యక్షముగా చూచుచు అట్టి సాక్షాత్కారము ద్వారా విశ్వసింతురు. ఇంక బహు కొలదిమంది భగవంతునితో ఏకత్వమొంది స్వీయ అనుభవము ద్వారా వారు విశ్వసింతురు. ఇది నిజమైన అనుభవము అంతియేగాని...

భగవంతుడు ఉన్నాడు అని చెప్పుచున్న ఆస్తికులకు, లేనేలేడని వాదించెడు నాస్తికులకు కూడా, భగవంతుడనగా ఏమో నిజముగా తెలియదు సరిగదా, ఉభయులకును భగవంతుడన్నది అనుభవములో లేదు.

వాస్తవమునకు మానవుని సంస్కారములు సమూలముగా నశించినప్పుడు, అతని పూర్ణ చైతన్యము పూర్తిగా సంస్కారబంధములనుండి విముక్తిని పొంది, ఆత్మను చేరుకొనును. అప్పుడాయాత్మ పరమాత్మయగును. సంస్కారవశముచే మానవునిలో ఇప్పటివరకు పరిమితి జెందియున్న ఆ పూర్ణ చైతన్యమే, ఇప్పుడు అనంతముగా రూపాంతర మొందినది. ఇట్టి స్థితినే 'మానవుడు భగవంతుడయ్యెను' అందురు. ఇంకను ఈ స్థితిని పలువురు పలునామములతో పిలుతురు. ఏమన :

God - Realization.

అద్వైతసిద్ధి

బ్రహ్మైక్యము

భగవత్సాయుజ్యము

జీవబ్రహ్మైక్యము

జీవాత్మ పరమాత్మల అనుసంధానము

విదేహముక్తి

బ్రహ్మీభూతస్థితి

నిర్వికల్పసమాధి

ఏకత్వము

ఏకమ్

పరమాత్మానుభూతి

జీవితపరమార్థము మొదలగునవి.

"భగవంతుని ప్రత్యక్షానుభవముచే కనుగొనునంత వరకు ప్రతి యొకడును నాస్తికుడే" యని మెహెర్ సూక్తి.
(From "The Moving Finger Writes" - Page 30 S. No 29)

వేదములు సహితము భగవంతుడిట్టివాడని చెప్పలేక పోయినవి గాని, భగవంతుడు లేడని మాత్రము చెప్పలేదు. భగవంతుడు అనెడు అనంత సత్యస్థితి మాటలకు, మనస్సునకు అందని అనుభవాతీతమైన అతీంద్రియ అవస్థ.

భగవంతుడనెడు స్థితి మానవశరీరముండగనే పొందెడు అనుభవస్థితి. ఇంతకు భగవంతుడున్నాడా ? లేడా ? ఉన్నచో ఎట్లుండును ? ఆతనికి రూపమున్నదా ? లేదా ? రూపమున్నచో ఏరూపములో కాన్పించును ? ఆతనిని ఎట్లు పొందగలము ? ఆతనిని ఆరాధించక పోయినచో వచ్చిన నష్టేమి ? ఈ మొదలగు సందేహములు కలవారును లేకపోలేదు.

కనుక ప్రతి మానవుడు అసలు భగవంతుడే ననియు, ఆ మానవుడు తన మానవ రూపములోనే "నేను భగవంతుడను" అనెడు తన స్వీయసత్యస్థితిని పొందుననియు తదనుభూతిని పొందుటకు వలయు జాగృతిని కలిగించుటకే తాను వచ్చితిననియు (శ్రీ) మెహెర్‌బాబా చెప్పుచున్నారు. ప్రతి మానవుడు చివరకు భగవంతుడు కావలసినదే! ఇది అతని జన్మహక్కు, జీవిత గమ్యము.

భగవంతుడున్నాడనెడు సత్యనిరూపణమునకై ఆతనిని దర్శించగల్గుటకును ప్రేమించగల్గుటకును, సేవించగల్గుటకును,

పొందగల్గుటకును, భగవంతుని మనకు చూపించుటకును, మానవుడు భగవంతుడు కాగలుగుటకు అవసరమైన ప్రేమ జాగృతిని; నూత్న చైతన్యమును, నూత్నశక్తిని, హృదయము లలో మేల్కొల్పి హృదయ సంతృప్తిని హృదయ ప్రశాంతిని కలుగజేయుటకును అనంత దివ్య ప్రేమసాగరుడైన ఆ భగ వంతుడే, మానవ రూపములో ఇప్పటికి 75 వత్సరములకు పూర్వమే మనము నివసించు యీ భూమిపై జన్మించి సజీవుడై మనకు సమకాలికుడై మానవులమధ్య ఒక మానవుని వలె వ్యవహరించుచు లోకకల్యాణ కార్యక్రమమును నిర్వ హించు చున్నాడు.

అట్టి సగుణసాకారుడైన సజీవమూర్తిని "అవతార పురుషుడు" అందురు. ఈ అవతార పురుషుడే మెహెర్ బాబా.

శ్రీ మెహెర్ బాబా రచించినదే "God Speaks" (భగవద్గీత) అను గ్రంథము. దీని యొక్క సంక్షిప్త రూపమే ఈ భగవద్దర్శిని ఇది :—

పరిణామము (ప్రవృత్తి మార్గము)
పునరావృత్తి (మానవ పునర్జన్మలు)
జ్ఞానమార్గము (నివృత్తి మార్గము)

అను మూడు ప్రధాన ప్రక్రియల ద్వారా నడిచినది.

జై బాబా!

రచయిత-
భాస్కరరాజు


భగవంతుడు.
పరిణామము.
పునర్జన్మలు.
ఆధ్యాత్మిక మార్గము.
భగవంతుడు.


పరాత్పర
పరబ్రహ్మ
i
పరిణామము
మానవుడు
ii
మానవరూపంలో
84 లక్షల
పునర్జన్మలు.
iii
జ్ఞానమార్గము.
పరమాత్మ



"అందరిలోనున్న పరమాత్ముఁడొక్కఁడే."

మెహెర్ బాబా.

## ప రి చ య ము.

— ౧ —

# భ గ వం తుఁ డు

# “ఉ న్నా డు”

**

# GOD “IS”

**

# భగవాన్ “అస్తి”

# చిత్ర శీర్షిక



అనంత శాశ్వత అస్తిత్వము.
B
"నేను భగవంతుడను"
(జీవితగమ్యము)
మానసిక ప్రపంచము.
నేను మనస్సును
సూక్ష్మప్రపంచము
నేను ప్రాణమును
ఆధ్యాత్మిక మార్గము
మాయా స్వప్నము
అజ్ఞానము.
పునర్జన్మలు
నేను పురుషుడను లేక నేను స్త్రీని.
భౌతిక ప్రపంచము.
పరిణామము
A
నేను ఎవరను?
(సర్వం) భగవంతుడు "ఉన్నాడు"

సర్వవ్యాప్తమైయున్న

అనంత

శాశ్వత అస్తిత్వమే

భగవంతుడు.

## ముఖచిత్ర వివరణము.




భగవంతుని

I పరాత్పర స్థితి = కేవల అనంతదివ్యశూన్యస్థితి

II A = పరమాత్ముని అనంత అవ్యక్త చైతన్య స్థితి

B = పరమాత్ముని అనంత వ్యక్త చైతన్య స్థితి

(నిర్గుణ నిరాకారము)

C = పరమాత్ముని సగుణ సాకార స్థితి

(సృష్టి లేక బ్రహ్మాండము)

● = మానవుడు.

ఇస్లామిక ఈశ్వరీయ వాదము.

*

* " హూవల్ అవ్వల్ "

" హూవల్ ఆఖిర్ "

" హూవల్ జాహిర్ "

" హూవల్ బాతిన్ "

(GDS—Page 148, Para 1)

*

* ఆతడు మొదటివాడు.

ఆతడు చివరివాడు.

ఆతడు వెలుపలివాడు.

ఆతడు లోపలివాడు.

భగవంతుడు =

అనంత అస్తిత్వము

అనంత జ్ఞానము

అనంత శక్తి

అనంత ఆనందము

అనంత చైతన్యము

అనంత సర్వవ్యాపకత్వము

"సత్యమ్ జ్ఞానమనంతమ్ బ్రహ్మ"

---

Notes.— చైతన్యము = తనయొక్క నిజస్థితిని తనకు తెలియచెప్పెడి అంతరాధికారమగు ఎఱుక.

ఆత్మన్, ఆత్మా, ఆత్మ

ఆత్మ = తాను

తాను = అతడు

అతడు అంటే ఎవరు ?

భగవంతుడు.

కనుక

ఆత్మ అనగా భగవంతుడు.

పరాత్పరుడు



మానవుడు



పరమాత్మ



సద్గురువు



అవతారపురుషుడు

లేక

ఆదిపురుషుడు

లేక

పురాణపురుషుడు

# భగవంతుని
# ఏకకాలిక
# దశవిధ పాత్రాభినయము.

# భగవంతుని దశ స్థితులు



# చైతన్యస్థితులు

1. అంతర్నిహిత చైతన్యము : పరాత్పర పరబ్రహ్మస్థితి.
2. ఎఱుకలేనిఅనంతచైతన్యము: పరమాత్మయొక్క (A) స్థితి.
3. అంతశ్చైతన్యము : సృష్ట్యారంభము నుండి జంతు శ్రేణివరకు.
4. పూర్ణ చైతన్యము : పునర్జన్మములను పొందుచున్న సామాన్యమానవులస్థితి.
5. దివ్య అంతశ్చైతన్యము : ఆధ్యాత్మిక మార్గములో — సూక్ష్మ, మానసిక భూమికలయందు ఎఱుక కల్గిన ముముక్షువుల స్థితి.
6. మహా చైతన్యము : నిర్వాణ స్థితిలో అమనస్కుని స్థితి.
7. అనంత దివ్య చైతన్యము : (ఎఱుకతోనున్న స్థితి) పరమాత్మయొక్క B స్థితి. నిర్వికల్ప సమాధి స్థితిలో, "నేను భగవంతుడను" అని అనంత ఆనందానుభూతి నొందుచున్న బ్రహ్మీభూతుని స్థితి.
8. సార్వభౌమిక చైతన్యము : (దివ్యచైతన్యము + సృష్టి యొక్క మిథ్యాచైతన్యము) ఆత్మ ప్రతిష్ఠాపన స్థితిలో నున్న సలీకులయొక్క, సద్గురువులయొక్క, అవతార పురుషునియొక్క చైతన్యము

# దివ్య ఇతివృత్తము

## భగవంతుని ప్రయాణము

1. 1. పరాత్పర పరబ్రహ్మ స్థితిలో భగవంతుడు
2. పరమాత్మ స్థితిలో భగవంతుడు
3. సృష్టి - స్థితి - లయకారునిగా నున్న భగవంతుడు
4. శరీరిగానున్న భగవంతుడు
5. పరిణామముగానున్న భగవంతుడు
6. పునర్జన్మములను పొందుచున్న మానవాత్మగానున్న భగవంతుడు
7. ఆధ్యాత్మిక ఉన్నత పథగాములలో భగవంతుడు
8. బ్రహ్మీభూతుడుగా భగవంతుడు
9. జీవన్ముక్తుడుగా భగవంతుడు
10. సద్గురువుగను, అవతారపురుషునిగను ఉన్న భగవంతుడు

2. ఈపై దశపాత్రలలో భగవంతుడు ప్రయాణమును సాగించుచున్నాడు. ఈ ప్రయాణములో — తనయందు ఎఱుకలేని A భగవంతుడు, ఎఱుకతో భగవంతుడు B అగుటకై, ముందుగనే ఎఱుకగలిగిన మానవుడగుచున్నాడు.

3. భగవంతుడు మానవునిగాదిగుటగాని లేక మానవుడు భగవంతునిగాఎక్కుటగాని... ఇవిఊహాలోమాత్రమేయున్నవి.

4. భగవంతుడే, ఊహాకల్పితమైన ఈదశపాత్రలను (మిథ్యాపాత్రలుగను, యథార్థమైనవిగను) నిర్వహించెను.

5. ఈ ప్రయాణములో ప్రారంభము భగవంతుడు. అంత్యము భగవంతుడు. మధ్యస్థితులు మాత్రము భగవంతుడు కాదు

# కొలికిపూస

"మానవుడు భగవంతు డయ్యెను.
మానవుడు భగవంతుడు కాగలడు.
తెలిసినను, తెలియక పోయినను
మానవుడే భగవంతుడు."

GDS/Page 65-
Para 3.

# విషయసూచిక

## పరాత్పర పరబ్రహ్మ



## పరమాత్ముడు



## సృష్టికర్త

## శరీరి



## పరిణామము



## పునరావృత్తి

## ఆధ్యాత్మిక మార్గము

## మానసిక గోళము



## నిర్వాణము

# విజ్ఞానము

---

భగవంతుని

మొదటిపాత్ర

పరాత్పర-

పరబ్రహ్మ

1. భగవంతుడనగా శాశ్వత అస్తిత్వము, అనంత సర్వ వ్యాపకత్వము. భగవంతుడు శాశ్వత అనంత అస్తిత్వమై నప్పుడు, అందులో భగవంతుని అనంతసంఖ్యగల స్థితులున్నవి. కాని అందు భగవంతునికి రెండే రెండు మూలాధారస్థితులున్నవి.

   1. అసలు (మూల) స్థితి.
   2. చరమ (పరమ) స్థితి.

2. భగవంతునికి చైతన్యమందు ఎటువంటి లేని ('భగవంతుడు ఉన్నాడు' అనెడు) పరాత్పర పరబ్రహ్మస్థితి.

3. భగవంతునికి చైతన్యములేని స్థితి – పరాత్పరము.
   భగవంతునికి చైతన్యముగలస్థితి – పరమాత్మ.

4. పరాత్పరస్థితికిని, పరమాత్మస్థితికినిగల భేదము చైతన్యము మాత్రమే.

5. సత్యమేయైన శాశ్వతత్వములో, అద్వితీయమైన అనంతమైన, శాశ్వతమైన, సర్వవ్యాపకమైన అస్తిత్వమే ఉన్నది.

6. భగవంతుని అనాది అనంత ఆదిమూలస్థితి:- పరాత్పర పరబ్రహ్మస్థితి ('భగవంతుఁడు ఉన్నాడు' అనుస్థితి)

7. * God 'IS' = సత్ (భగవంతుడు ఉన్నాడు, నిస్సీమ కేవల శూన్యత్వం. భగవంతుని, యీ 'ఆదిమూల అపార కేవల శూన్యస్థితి' లో, ఏ వ్యక్త స్థితియు లేదు. అది అవ్యక్తస్థితి.

గుప్తాతి గుప్తము (అంతరాంతర్నిహితము) గ్రహింప రానిది, ఇది అని చెప్పరానిది (నేతి, నేతి), అసాధ్య మైనది. భగవంతుని అంతర్నిహిత శక్తియే (శక్యత) భగవంతుని అంతరస్థితి.

8. అపారము అనంతము దివ్యము పరమము అయిన ఈ కేవల శూన్యత్వములో—

1. చైతన్య స్థితియు లేదు,
   చైతన్యరాహిత్య స్థితియు లేదు.
2. అపరిమిత అహమ్ లేదు (దివ్యాహమ్)
   పరిమిత అహమ్ లేదు.
3. సార్వభౌమిక మనస్సు లేదు,
   పరిమిత మనస్సు లేదు.
4. అపారమైన శక్తి లేదు.
   పరిమిత శక్తి లేదు.

---

* అనంత. నిరవధిక పరమ శూన్యస్థితి (God - 'IS')

5. మహాకారణ శరీరము లేదు,
పరిమిత దేహము లేదు.

6. విశ్వములు లేవు,
లోకములు లేవు.

చైతన్యమందుగాని లేక, చైతన్యరాహిత్యస్థితి యందు గాని అసలు ఎఱుకే లేదు.

ఇది............నిర్గుణ నిరాకారమును కాదు.
సగుణ సాకారమును కాదు.

అక్కడ ఉన్నదే 'భగవంతుడు'
చైతన్యము 'లేదు'

9. అపారము, కేవలము (పూర్ణము) అనంత దివ్యశూన్యత్వము (మహాకాశము) అయిన పరాత్పరస్థితిలో అన్ని గుణములు, అన్నిరూపములు, అన్ని స్థితులు, అణుప్రమాణ చైతన్యము, అనంతముగా ఎఱుకగల అనంత చైతన్యమును; అనంతముగా ఎఱుకలేని అనంత చైతన్యమును, అనంత భగవల్లీలయు, తనను తాను తెలిసికొనవలెననెడి అనంత ఆదిప్రేరణము, భగవంతుని స్వీయ అనంతస్వభావత్రయము, తదితరములు అన్నియు అంతర్నిహితములై యున్నవి.

10. ఉండి 'లేని' స్థితి (శూన్యము, ఆకాశము, అభావము) లేకుండి 'ఉన్న' స్థితి (సృష్టి) ఆభాసము.

---

Notes :— నేతి = న + ఇతి (ఇది కాదు)

ఉదా:— క్షీరములలో – పెరుగు,
మజ్జిగ,
వెన్న,
నేయి, అంతర్నిహితమై
యుండి, బాహ్యామునకు
లేకున్నవి.

తంత్రిలో – శబ్దము అంతర్నిహితమై
లేనట్టుగా ఉన్నది.

చెకుముకి రాతిలో – అగ్ని అంతర్నిహితమైలేనట్టుగా
ఉన్నది.

విత్తనములో – వృక్షము అంతర్నిహితమై లేనట్టుగా
ఉన్నది.

వీర్యకణములో – సర్వాంగ సుందరమైన స్థూలశరీరము
అంతర్నిహితమై లేనట్టుగా ఉన్నది.

గ్రామఫోను రికార్డులో – సంగీతము, వాద్యధ్వనులు
అంతర్నిహితములై లేనట్టుగా ఉన్నవి.

11. పరాత్పర స్థితిలో – సమస్తము అభావమై ఉన్నవి.

12. సర్వమ్ అయిన పరాత్పర పరబ్రహ్మ స్థితిలో, లేనిస్థితి (అభావము) కూడా ఉన్నది.

---

Notes :— భూ = సత్తాయామ్
సత్తాయామ్ = ఉండుటయందు
భవతీతి భావః = ఉండుట
అభావః = లేకుండుట

భావములో (EVERY THING), అభావము
(NOTHING) అంతర్నిహితమై ఉన్నది.
చైతన్యముకూడా అంతర్నిహితమై ఉన్నది.

13. పరాత్పర స్థితిలో – అనంతజ్ఞానము
అనంత శక్తి
అనంత ఆనందము
అనంత వైభవము
అనంత సౌందర్యము
అంతర్నిహితమై, అభావమై యున్నవి.

14. 'అనంత సర్వమ్' అయిన భగవంతునికి, విరుద్ధమైన అభావము అత్యంత సూక్ష్మమై యుండవలెను.




15. పరిమిత అభావము అనంత మెట్లయ్యెను ?
భగవంతుని అనంత స్వభావమైన – అనంతజ్ఞాన శక్త్యా

Notes.—సర్వమ్ = భావము (EVERYTHING)
అభావము = (NOTHING)
సృష్టి = ఆభాసము (Nothingness)

నందములే, పరిమిత అభావమునకు అనంతత్వమును కలుగ జేసినవి.

16. అత్యంత పరిమితమైన అభావము అభివ్యక్తమైనప్పుడు దాని ఆవిష్కారము క్రమక్రమముగా బయటికి నిగిడి నిగిడి అనంతముగా వ్యాపించెను.

17. సర్వమ్ లో అంతర్నిహితమై యున్నది ఏదైనను అభావమే. సర్వంలో చైతన్యము కూడా అభావమై యున్నది.

భావము X అభావము

అభావము X ఆభాసము

EVERYTHING × NOTHING

NOTHING × Nothingness

శూన్యం = Vacuum

---

Notes :—సృష్టి రూపమున వ్యక్తమైయున్న భగవంతుని సృష్టికర్త యనియు, ఈశ్వరుడు అనియు అందురు. ఈశ్వర - శబ్దము, సందర్భము ననుసరించి 'పరమాత్మ' యనికూడ నొప్పును. ఇట్టి ఈశ్వరునకు పరుడు ఎవరు ? పరమేశ్వరుడు, పరేశుడు.

పరుడు = ఆవలివాడు (God, The Beyond State)

పరాత్పరుడు = పరునకు ఆవలివాడు

పరాత్ + పరః = పరాత్పరః

(God, The Beyond Beyond State)

పరుడు = ప్రకృతి మాయను దాటినవాడు

బ్రహ్మ = సృష్టికర్త; జగత్కర్త; ఈశ్వరుడు

పరబ్రహ్మము = సృష్టికర్తను మించినవాడు (పరమాత్ముడు)

ఈశ్వరుడు = జగత్కర్త (Creator)

పరమేశ్వరుడు = (God. The Beyond State of Creation)

18. పరాత్పర పరబ్రహ్మస్థితి అనూహ్యమైన అనన్యమైన పరిశుద్ధ స్వరూపము. సమ సజ్జ్ఞానము సమస్త అంతర సత్యములు దాగియున్న పరమనిధి. అవాఙ్మానస గోచరమైన అవ్యక్తస్థితి. ఇది పరిమితమును గాదు అపరిమితమునుగాదు. సగుణమును కాదు, నిర్గుణమును కాదు. సాకారమునుకాదు, నిరాకారమును కాదు. అనంత అగోచర స్థితి,

19. ఎవరైనను ఈ పరాత్పర పరబ్రహ్మస్థితియొక్క అనుభూతిని పొందినచో, దానిని యితరులకు వర్ణించి చెప్ప




సృష్టికి పరమైన
ఆదిమూల స్థితికన్న
పరమైన
అనాద్యనంత మూలస్థితియే
పరాత్పర పరబ్రహ్మ స్థితి

వలెనన్న చో, రెండవస్థితియైన పరమాత్మస్థితిని మాత్రమే చెప్పగలరు. ఈ పరిశుద్ధ స్వరూపమునను తనయందు గాని, ఇతరమందుగాని స్పృహయే లేదు. పరమ నిగూఢ స్థితి.

20. భగవంతుని ప్రధాన దశావస్థలలో పరాత్పర స్థితి అనాది ఆదిమూలస్థితి. ఈ దశస్థితులలో తక్కిన 9 స్థితులును లేనప్పుడుకూడా 'భగవంతుడు ఉన్నాడు' అనెడు పరాత్పరస్థితియే ఉన్నది.

21. భగవంతుని పరాత్పరస్థితియొక్క అనాద్యనంతత్వము లోని అనంతత, అపారముగను నిరవధికముగను కేవలముగను అనంత దివ్యశూన్యత్వముగను (మహాకాశము) ఆవిష్కారమగు చున్నది.

22. పరాత్పర స్థితియందు భగవంతుడు సత్యమందు గాని, మిథ్యయందుగాని, సాంతముగా గాని అనంతముగా గాని ఎఱుకలేక యున్నాడు.

23. సృష్టికి పూర్వమందేమియు లేదు సర్వశక్తిమంతుడైన భగవంతుడే 'సర్వమ్' అయి ఉండెను.

24. సృష్టికి పూర్వము భగవంతుడు మాత్రమే ఉండెను, కాని అతడు అంతర్నిహితముగా ఎఱుకతో నుండెను. అట్లే చైతన్యము, సృష్టి, వానిలో అంతర్నిహితమై యుండెను.

25. అంతర్నిహితమైయున్న సృష్టి :- బీజము వంటిది.
ఆవిష్కారమైన సృష్టి :- వృక్షము వంటిది.

## పరమాత్ముడు

26 పరమాత్మ స్థితి భగవంతుని అనంతగోచరస్థితి.

27 వేర్వేరు మతములు పరమాత్ముని ఇట్లు పిలుతురు.

సూఫీలు — అల్లాహ్
జొరాస్ట్రియనులు — అహూరామజ్దా
వేదాంతులు — పరమాత్మ
క్రైస్తవులు — పరమపిత, పరలోకతండ్రి
దార్శనికులు — అధ్యాత్మ

28. పరమాత్మ స్థితి : కేవలము, అపరిమితము, అనంతము అయిన అద్వైత స్థితి.

29. పరాత్పర స్థితికిని పరమాత్మస్థితికిని మూలస్థితిలో భేదములేదు.

30. అవ్యక్తమైన పరాత్పరస్థితిలో అంతర్నిహితమైయున్న ఆది ప్రేరణము భంగము కాగా, పరాత్పరుడు — పరమాత్మ — యను మరియొక అనంతస్థితిని పొందెను.

31. పరాత్పరునియొక్క అనంతవ్యక్త స్థితియే పరమాత్మస్థితి.

32. భగవంతుని మొదటి స్థితియైన పరాత్పరస్థితిలో అంతర్నిహితమైయున్న అనంత 'ఆది ప్రేరణము' తనను తాను

తెలిసికొనుటకు "నేను ఎవడను ?" అని పరమాత్మ
స్థితిలో తరంగములవలె చలించెను.

33. పరాత్పర స్థితిలో అంతర్నిహితమైయున్నదంతయు ప
మాత్మస్థితిలోనే వ్యక్తమగుటకు ఆస్కారము కలిగినది

34 "నేను ఎవడను ?" అను ఆదిప్రేరణము పరాత్ప
స్థితిలో ఎన్నడు అనుభవము కాలేదు. పరమాత్మ స్థి
లోనే "నేను భగవంతుడను" అని అనుభవమున
పొందెను.

35. "నేను ఎవడను?" అనెడి ఆదిప్రేరణము తరంగచలితమై
తక్షణమే, ఒకేసారి అంతర్నిహితమైయున్న అనంత
చైతన్యస్థితియు అనంతచైతన్యరాహిత్య స్థితియు, పర
మాత్మస్థితిలో అభివ్యక్తమయ్యెను.




36 భగవంతుడు తనస్వీయ అనంతచైతన్యరాహిత్య స్థితి
యును, అనంతచైతన్యస్థితియును; తన రెండవ స్థితి
ద్వారా మొదటి స్థితిలో యాదృచ్ఛికముగా పొందెను.




A = అనంతచైతన్య రాహిత్య స్థితి
B = అనంత చైతన్యస్థితి

ఉపమానము :—

ఒక స్త్రీ తనకు గర్భధారణమైనదని భావించినప్పటినుండియు, తల్లి గర్భములో శిశువు పెరుగ నారంభించును. కాలక్రమములో శిశువుయొక్క అవయవములన్నియు పెరుగుచుండును. అన్నింటితోపాటు 'నేత్రములు' కూడా పూర్తిగా తయారై వాటికిచూచెడి శక్యత యేర్పడును.శిశువు ఉదయించిన తరువాత కండ్లు తెరచినచో చూడగల్గును. కండ్లు మూసినచో చూడలేక పోవును.

అట్లే, ఏకకాలమందే అనంతచైతన్యమందు ఎఱుకలేనిస్థితి, ఎఱుకయున్నస్థితి ఒకేసారి యాదృచ్ఛికముగా పరమాత్మస్థితిలో వ్యక్తమయ్యెను.

37. భగవంతుని రెండవస్థితియైన పరమాత్మలో ABC అను మూడు అంతరస్థితులున్నవి.

భగవంతుడు




38. పరమాత్మయొక్క (A) స్థితిలో అనంతచైతన్య రాహిత్య స్థితి, పరాత్పరస్థితిలోను పరమాత్మ స్థితిలోనుకూడా అనంతముగా ఎఱుకలేకనే శాశ్వతముగా నిలిచి యున్నది.

భగవంతుడు = అనంత అస్తిత్వము +
అనంత జ్ఞానము +
అనంత ఆనందము –
అజ్ఞాత చైతన్యము.
= సత్ + చిత్ + ఆనంద (మైనస్)
అజ్ఞాత చైతన్యము.
= సచ్చిదానందము (మైనస్) అజ్ఞాత.
చైతన్యము.

39. పరమాత్మయొక్క (B) స్థితిలో అనంత చైతన్యము, పరాత్పర స్థితిలోను పరమాత్మస్థితిలోనుకూడా అనంతముగా ఎఱుకతో శాశ్వతముగా నిలిచి యున్నది.




**40.** A = భగవంతుడు తన స్వీయ అనంత స్వభావత్రయమైన అనంత జ్ఞాన – శక్తి – ఆనందములను ఎఱుకతో అనుభవించుటయు లేదు, పరులకై వినియోగించుటయు లేదు.

**41.** A = భగవంతునికి అనంతముగా ఎఱుకలేని స్థితి. ఇది నిర్గుణ నిరాకారమును కాదు, సగుణ సాకారమును కాదు. ఇందు సృష్టియు, చైతన్యమును అంతర్నిహితములై యున్నవి.

**42.** ఆత్మ స్వీయ చైతన్యమును సంపాదించుటకుగాను

1 పరిణామ క్రమము

2. పునరావృత్తి క్రమము

3. ఆధ్యాత్మిక మార్గము

అనునవి ఆవశ్యకమై యున్నవి.

43. ఆత్మలన్నియు ఆ పరమాత్మలో ఉండెను,
ఆత్మలన్నియు ఆ పరమాత్మలో ఉన్నవి,
ఆత్మలన్నియు ఆ పరమాత్మలో ఉండును.

44. ఆత్మలన్నియు ఒకటే. అన్ని ఆత్మలు ఒకటే.

45. ఆత్మలన్నియు అనంతమైనవి, శాశ్వతమైనవి : కారణమైనవి.

ఆత్మ - పరమాత్మల - సంబంధము.






46. పరమాత్మను హద్దులులేనట్టి ఒక అనంతమైన మహా సాగరముతో పోల్చుకొనినచో, ఆత్మను ఒక బిందు లవలేశముతో పోల్చవచ్చును.

47. హద్దులులేని అనంత పరమాత్మ అనెడు మహాసాగరము నుండి, బిందు ప్రమాణమైన ఆత్మ; సరిహద్దులే లేని పరమాత్మ సాగరమునుండి ఎట్లు బయట పడగలదు ? ఎట్లు వేరుకాగలదు ? బయట పడలేదు. వేరు కాలేదు. కనుక

48. ఆత్మ, పరమాత్మలోనే, ఉన్నది అనుట తొలిసత్యము. ఇంక, అసలు ఆత్మయె – పరమాత్మ అన్నది మలి సత్యము.

49. సాగర జలమునుండి. ఒక బిందు లవలేశమును వెలికి తీయకపూర్వము, అది సాగరములో కలిసియేయున్నది. బయటికి తీయబడినప్పుడే బిందురూప మేర్పడుచున్నది. అనగా సాగరమే ఒక అనంతమైన నీటిబిందువు అని చెప్పవచ్చును.

50 వెలికి తీసిన బిందు లవలేశమును, అనంతసాగరముతో పోల్చినప్పుడు, బిందువునకు పరమాణు ప్రమాణముగల పరిమితి యేర్పడుచున్నది. బిందువు సాగరములో నున్నప్పుడు పరమాణు ప్రమాణమైన బిందువునకు కూడా అనంతత్వమే ఏర్పడుచున్నది. కనుక

## ఆత్మయే పరమాత్మ.
## పరమాత్మయే ఆత్మ.




### ఆది ప్రేరణము

**51.** ఇప్పుడు మనము తనయందు స్పృహలేని ఒక (అచేతనావస్థయందున్న) ఆత్మను గూర్చి యోచించుదము.

**52.** ఆదిలో, ఆత్మకు సంస్కారములు లేవు
చైతన్యము లేదు.

**53.** సంస్కారములు, చైతన్యములేని ఆత్మయొక్క అనంతమైన నిశ్చల ప్రశాంత స్థితిలో, తానెవరో తెలిసికొనవలె ననెడి ఆదిప్రేరణము ప్రతి ధ్వనించునట్లు ఘోషించెను.

**54.** ఈ ఆదిప్రేరణము పరమాత్మలోనే అంతర్నిహితమై యుండెను.

**55.** అనంత సాగరుడైన పరమాత్ముడు ప్రథమ ప్రేరణమును పొందెను.

56. ఈ ప్రథమ ప్రేరణము, అనంతముయొక్క ప్రేరణయే ఇది ప్రారంభములో పరమాణు ప్రమాణములో నుండెను.

57. అనంతములో — సాంతము, అనంతము రెండును ఇమిడియే యున్నవి.

భగవల్లీల
(లేక)
భగవద్విలాసము.

58. సర్వమ్ (పరాత్పరస్థితి)లో అంతర్నిహితమైయున్న పరిమిత అభావము అనంతమైన సృష్టిగా అభివ్యక్తమగుటకు మూలకారణము 'సర్వకారణత్వమే'

59. "నేను ఎవడను ?" అని భగవంతుడు పలికిన మూల శబ్దమునే సర్వకారణత్వము అందురు.

నేను ఎవడను ? — కారణము
సృష్టి — కార్యము.

60. భగవంతుని ఆది విలాసమే ఆతని తొలిపలుకు.

61. "నేనెవడను ?" అన్నదే భగవంతుని తొలిపలుకు.

62. ఆది విలాసము అభావమును సృష్టించెను.

68. "నేను ఎవడను?" అన్నదే — భగవంతుని ఆదిమూలమైన అంతర్నిహిత ప్రథమ సంస్కారము.

64. ఆదిమూలమైన ప్రథమసంస్కారమే అంతర్నిహితమై యున్న ఈ మిథ్యాజగత్తును సృష్టించినది.

65. ఆదిప్రేరణముయొక్క ప్రతిధ్వని ఘోషలచే అప్పటి కప్పుడు వైవిధ్యమనెడి బీజము నాటబడి అగోచర స్థితిలో అంకురించి ద్వైత రూపములో తొలిసారిగా వ్యక్తమయ్యెను.

66. ఆదిప్రేరణముయొక్క ప్రతిధ్వని ఘోషలతోపాటు, పరమాణు ప్రమాణమైన స్థూలసంస్కారము ఆవిర్భవించి ఆత్మను, పరమాత్మను భిన్నమైన దానిగను, ప్రత్యేకమైనదిగను, పరమాణు ప్రమాణములో స్థూలమైనదిగను, అత్యంత పరిమితమైనదిగను చేసినది.

67. ఆదిప్రేరణముయొక్క, మిక్కిలి స్థూలమైన తొలి సంస్కారము కారణముననే, అనంత పరమాత్మ తొలిసారిగా అనుభవమును పొందెను.

68. అనంతాత్మయొక్క యీ తొలి అనుభవము, సంస్కారములు లేనట్టి, ఎఱుక లేనట్టి అనంత పరమాత్మతోగల తాదాత్మ్యతను ప్రతికూలముగా అనుభవమును పొందెను.

69. ఈ ప్రతికూల అనుభవము, అనంతాత్మయొక్క శాశ్వత, అఖండ నిశ్చల ప్రశాంతతలో మార్పును కలిగించినది. అప్పుడే అనంతాత్మయొక్క అఖండ నిశ్చలత్వములో

ఒక పరమాద్భుతమైన వ్యాఘాతము (అదురు) సంభ వించినది. ఆ తాకిడి ఎఱుకలేకున్న పరమాత్మయొక్క చైతన్యరాహిత్య (A) స్థితిలో తొలిచైతన్యమును పుట్టించినది.

70. చైతన్యములేని ఆత్మకు ప్రథమ ప్రేరణముయొక్క ప్రథమ సంస్కారమే ప్రథమ చైతన్యమును కలుగ జేసినది.

71. అత్యంత పరిమితమైన ఆది విలాసము, భగవంతునిలో చలించి, చైతన్యమందు ఎఱుకలేని భగవంతునికి పర మాణు ప్రమాణమైన తొలిఎఱుకను కలుగజేసినది.

72. చైతన్యము, మానవునిచే సంస్కారములను అనుభ వింప జేయును.

73. పరాత్పర స్థితియొక్క అనంతత్వము, భగవంతుని పూర్తిగా సర్వస్వతంత్రుని చేసినది. అందుచేత సర్వ స్వతంత్రుడైయున్న భగవంతుడు తన అనంత (లీల) విలాసమును సాధన పూర్వకముగా అనుభవించి ఆనందించుట సహజమే.

74. లీలను సాధనచేయుటయే స్వతంత్ర స్వభావమునకు చిహ్నము. ఎందుచేతననగా ఈ విలాసమే స్వతంత్ర స్వభావమునకు రంగును (సంస్కారమును) పూసినది.

75. సర్వమ్‌లో, అభావముగా అంతర్నిహితమైయున్న దంతయు, ఆ విర్భవించుటకుగల కారణమునకు అనంత మైన ఆదివిలాసమునదే బాధ్యత.

76. విలాసము అనగా విలాసమే గనుక, యీ భగద్వి లాసము యొక్క స్వభావమును బట్టి, అది ఎందుకు వచ్చినది ? ఎక్కడ వచ్చినది ? ఎప్పుడు వచ్చినది ? అని అనుకొనుటకు ఎక్కడను ఆస్కారము లేదు.

77. పరమాత్ముడే అనంత సర్వమ్.

78. అనంత సర్వమ్, అనంత అపార సాగరము వంటిది, అయినప్పుడు...సాగరమందలి ప్రతిబిందువు అత్యంత పరిమిత సర్వమ్ అగుచున్నది.

79. సర్వమ్ అయిన భగవంతునిలో, ఈ భగవల్లీల చలిం చిన తక్షణమే 'ఓం' కార బిందువు అత్యంత, పరిమిత సర్వమ్‌గా వ్యక్తమయ్యెను.

80. అనంత సర్వమ్‌లో, అనంత అభావము అంతర్నిహితమై యున్నది. అనంత అభావములో భగవల్లీల చలించగా ఓం కార బిందువుద్వారా, అభావము సృష్టిరూప ములో ఆవిర్భవించెను.

"ఓమ్"

(లేక)

సృష్టిబిందువు.

81. అనంత పరమాత్మలో, పరమాణు ప్రమాణములో అంతర్నిహితమైయున్న ఆదిప్రేరణముయొక్క పరమాణు ప్రమాణమైన ఆవిష్కారబిందువే ఓం బిందువు.

82. ఓం బిందువు ద్వారా అభివ్యక్తమైన పరమాత్మయొక్క ప్రతిబింబము (సృష్టి) క్రమక్రమముగా కన్పించి, వ్యాపించుచు పెరిగిపోయెను.

83. సర్వమ్ (భగవంతుడు ఉన్నాడు అనుస్థితి)లో అంతర్నిహితమై యున్న అభావమునుండి, దివ్య అంతశ్చైతన్యము మాత్రమే ఓం బిందువు ద్వారా తప్పనిసరిగా బహిర్గతమైనది.

84. భగవంతుని దివ్యసుషుప్తినుండి భగవంతుని అంతశ్చైతన్యము, సృష్టిబిందువు (ఓం) ద్వారా పైకిలేచునప్పుడు దివ్య సుషుప్తికి భంగము వాటిల్లి భగవంతుని మూలనాదమైన (బ్రహ్మనాదమ్) ఓంకార ధ్వనితో పాటు _ దేశము (ప్రదేశము) కాలము, భౌతికవిశ్వము, దానికి, సంబంధించిన వస్తుజాలము (పరిమిత అహం, మనస్సు, ప్రాణము) వివిధములైన వ్యష్టి రూపములు బహిర్గతమగునట్లు చేసినది.

85. భగవంతుడు తన దివ్యసుషుప్తినుండి (పరాత్పరస్థితి) దివ్యజాగృతికి (అహమ్ బ్రహ్మాస్మి స్థితి) మేల్కొనవలెనన్నచో తన దివ్యస్వప్నస్థితియైన మాయాసృష్టిని దాటి రావలయును.

86. అభావముగా అంతర్నిహితమైయున్న సృష్టి, పరమాణు ప్రమాణమైన బిందువు ద్వారా, అభివ్యక్తమైనది. ఈ బిందువునే 'ఓమ్' బిందువనియు, సృష్టి బిందువనియు అందురు. ఈ బిందువుకూడా పరాత్పరస్థితిలో అంతర్నిహితమై యున్నది.




Bird's Eye View.



## భగవంతుని మూడవపాత్ర

## సృష్టికర్త (త్రిమూర్తిత్వము)

87. భగవంతుని మూడవస్థితిలో, భగవంతుడు సృష్టి-స్థితి-లయము, అనెడు ప్రధాన ధర్మములను నిర్వహించు త్రిమూర్తుల పాత్రలను వహించెను అవి :

| ప్రధాన ధర్మములు. | అధినాయకులు. | | |
|---|---|---|---|
| సృష్టి | బ్రహ్మ | ఆఫరీద్‌గార్ | ఇస్రాఫీల్ |
| స్థితి | విష్ణు | పర్‌వర్‌దిగార్ | మైకేల్ |
| లయము | మహేశ్ | ఫనాకార్ | ఇజ్రాఈల్ |

88 భగంతుని మూడవస్థితిలోనున్న ప్రధాన ధర్మములైన సృష్టి - స్థితి-లయములు భగవంతుని మొదటిస్థితియైన పరాత్పర స్థితిలో అంతర్నిహితములై యుండెను.



89. అభావము ముందుగా సృష్టిరూపములో అభివ్యక్తమైనప్పుడు, అభావముయొక్క ప్రథమస్వరూపము భగవంతునిలో చైతన్యపు తొలిజాడను కనుగొన్నది. అటుపైని సృష్టియొక్క ప్రథమ సంస్కారము వ్యక్తమయినది. ఈ ప్రథమ సంస్కారమే చైతన్య పరిణామముతోపాటు సంస్కారములను ఉత్పత్తి చేసినది.

90. సృష్టియొక్క పరిమిత సంస్కార అనుభవమే, భగవంతుని దివ్యస్వప్నముగా ఆరంభమాయెను.

91. ఆదికాలమైన అనంతలీల 'కారణము'గా, భగవంతునిలో పరమాణు ప్రమాణమైన చైతన్యము వ్యక్తమైనది. ఆ చైతన్యము, సృష్టి రూపమున అభివ్యక్తమైన అంతర్నిహిత అభావముయొక్క పరిమిత సంస్కారమును, అంతశ్చైతన్యము ద్వారా సగమెలుకలో భగవంతునిచే అనుభవింప చేసినది.

92. అభావము యొక్క ఆవిష్కారమే ఆభాసమైన సృష్టి.

93. పరమాత్మస్థితిలో అభావమై యున్నవన్నియు, అనంత ఆదిప్రేరణముచే ముందుకు సత్వరపరచగా(త్రోయగా) అవి, పరమాత్మని (A) స్థితిలోనుండి సృష్టిరూపమున ఆవిష్కార మొందెను.

Notes:— ఆభాసము = లేక, ఉన్నట్లు కనిపించునది
(Nothingness or False Everything)
అభావము = ఉండి, లేనట్లు కనిపించునది (NOTHING)
సృష్టి = కల్పన; కల్పించినది

**94.** (a) కాబట్టి, తొలిసారిగా భగవంతుని అనంత చైతన్య రాహిత్య స్థితి ( A ) జీవితమును సృజించుటలో సృష్టికర్త ధర్మమును పొందెను.

(సృష్టించుటయను భగవదంశయే బ్రహ్మ)

(b) సృష్టికర్త ధర్మమును చేబట్టగనే, ఆ సృష్టించిన జీవితమును పోషించుటలో (పరిరక్షించుటలో) స్థితికారుని ధర్మమును పొందెను

(పోషించుట యను భగవదంశయే విష్ణువు)

(c) సృష్టించిన జీవితమును పోషించుటలోనే తప్పని సరిగా **లయము** ను కూడా స్థాపించు చున్నాడు.

(నశింపచేయుటయను భగవదంశయే **మహేశ్వరుడు**)

**95.** భగవంతుని అనంత స్వభావత్రయమైన – అనంత శక్తి-జ్ఞాన – ఆనందములచే, పరిమితమైయున్న అభావము వ్యక్తమైనప్పుడు సృష్టిరూపమున వ్యాపించెను.

ప్రశ్న : సృష్టి యేల నిజముకాదు ?

**96.** అభావమునుండి పుట్టిన ఈ అనంతసృష్టి, భగవంతుని ప్రతి బింబము. భగవంతుడు అనంతుడు గనుక ఆతని ప్రతి బింబమైన సృష్టికూడా అనంతమే, ఐనను ప్రతి బింబము నిజముకాదు. కాబట్టి, సృష్టికూడా నిజము కాదు. వట్టిభ్రమ.




97. అభావముయొక్క ఆవిష్కారమైన సృష్టి, మిథ్యద్వారా ఉన్నట్లు కనిపించుచున్నది.

98. అభావము యొక్క అసంఖ్యాక రూపముల వ్యక్తీకరణమే సృష్టి.

99. అనంత సర్వమ్, అయిన భగవంతునిలో, విలాసము (చిద్విలాసము) తరంగములవలె చలించుటకు పూర్వము, సర్వములో అంతర్నిహితమైయున్న అభావమున్నూ, అభావమునుండి ఆవిర్భవించినసృష్టియున్నూ ఒకేసారి బయటికి పొడుచుకురాగా, పరాత్పరస్థితిలో అభావముగా అంతర్నిహితమైయున్న చైతన్యము, క్రమక్రమముగా భగవంతుని చైతన్యముగా ఆవిర్భవించి, సర్వమ్ నుండి పుట్టిన సృష్టికి తానే కర్తననెడి అనుభవమును భగవంతునికి కలుగజేసినది.

100. భగవంతుడు సృష్టి కర్తగా, అభావమునుండి ఆవిర్భవించిన సృష్టిని భగవత్సర్వముగా మిథ్యానుభూతి నొందుచున్నాడు

---

Notes.— సర్వమ్ = పరాత్పర; భావము.

101 పరాత్పరస్థితి యందున్న భగవంతుడు తనయొక్క, తన స్వీయ సత్యముయొక్క, అనంత సచ్చిదానంద స్థితియొక్క పూర్ణచైతన్యమును పొందుటకుగాను, యీ మిథ్యానుభూతిలో చిక్కుకొనుట అవసరము.

102. సంస్కారముల ద్వారా సృష్టిచైతన్యము సేకరించ బడినది.

103. సృష్టి - స్థితి - లయములు నిరంతరముగా ఏకరూపతగా జరుగుచునే యుండును.

ఉదాహరణము :—

మానవశరీరమును భగవంతునిగా పోల్చుకొందము.

(a) కండ్లుమూసికొని నిద్రించుచున్న మానవుడు :— పరమాత్మలో A స్థితి యనుకొనుడు

(b) కండ్లు తెరవగనే, సృష్టి - యనుకొనుడు.

(c) తెరచినకండ్లతో అన్నీ చూచుచుండుట } స్థితి యనుకొనుడు.

(d) మరల కండ్లుమూసికొనినచో } లయము అనుకొనుడు

104. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ప్రధానదేవదూతలు. వీరు పరిమిత జీవితమును హెచ్చు ప్రమాణములో సృష్టించుటయందును, దానిని పోషించుట యందును, పోషించిన దానిని లయమొనర్చుటయందును గల భగవంతుని ప్రధాన దివ్య ధర్మములను వ్యక్తపరచు

టలో ఈ ప్రధాన దేవదూతలు మధ్యవర్తులుగా నుందురు.

105. భగవంతుని అపరిమిత జ్ఞానమును పరిమిత ప్రమాణములో నివేదించుటలో కూడా మధ్యవర్తులుగానుందురు.

106. ప్రధాన దేవదూతలు సత్త్వములు. వారెల్లప్పుడు భోగములనుభవింతురేకాని బాధలను పొందరు.

107. అనంతమైన భగవల్లీల 'కారణము'గా దివ్యసుషుప్తియైన మూల స్థితికి భంగము కలిగి, దాని ఫలితముగా "సృష్టి" కార్యరూపము దాల్చినది. ఇవియే కార్య - కారణ ధర్మములు.




108. భగవంతునికి సృష్టి - స్థితి - లయము అనెడు ప్రధాన ధర్మములను ప్రసాదించుటలో భగవంతుని ఆది విలాసమే బాధ్యతకలదై యున్నది.

భగవంతుని నాల్గవపాత్ర

శరీరి (రూపధారణము)

109. అనంత ఆదిప్రేరణముయొక్క సంచలనముచే అనంత సాగరమందలి ప్రతి బిందువు తనను తాను తెలిసి కొనుటకు ప్రేరేపింపబడెను.

110. పరాత్పర స్థితియందున్న భగవంతుడు, తొలిగా తన సత్య స్థితియొక్క జ్ఞానమును సంపాదించుట కంటె, సంస్కార భూయిష్ఠుడై అజ్ఞానమునే సంపాదించు చున్నాడు.

111. ప్రారంభములో పరమాత్మయొక్క A స్థితిలో ఆత్మకు చైతన్యము, సంస్కారములు లేవు.

112. ప్రారంభములో, ఆత్మకు దేహాత్రయమందుగాని తన యందుగాని స్పృహ లేదు. అందుచేత ఆయా దేహ ములకు సంబంధించిన లోకానుభవమును లేదు. పర మాత్మానుభవము అంతకన్న లేదు.

113. ఆత్మ, శాశ్వతముగా పరమాత్మలోనుండి, పరమాత్మలో నుండి స్పృహలేని స్థితియందున్నను, పరమాత్మ యొక్క అనంతశక్తులగు జ్ఞాన - శక్తి, ఆనందములను పొందెడి హక్కుగలదై యున్నది.

114. ఒకేసారి సంస్కారములులేని ఆత్మకు, ప్రథమముగా సంస్కారమును, చైతన్యమే లేని ఆత్మకు ప్రథమముగా చైతన్యమును కలిగినవి. ఇట్లు కలిగిన ప్రథమ సంస్కారము పరమాణు ప్రమాణమైన స్థూల సంస్కారము.

115. అనంత శాశ్వత (A) పరమాత్మ పొందిన చైతన్యము అత్యంత పరిమితమైన స్థూల సంస్కారము మూలముగా పొందిన అత్యంత పరిమిత స్థూల చైతన్యమేగాని అది......తన అనంత స్థితియొక్క చైతన్యమునుగాదు, లేక (B) స్థితిలోని అనంత పరమాత్మయైన తన స్వీయ చైతన్యమును గాదు.

116. అవిభాజ్యమైన ఆత్మయొక్క తొలి చైతన్యము, తొలి రూపము ద్వారా తొలి సంస్కార అనుభవమును పొందుచూ, ఆత్మలో ఒక మనోప్రవృత్తిని సృష్టించుచున్నది. అదియేమనగా – పరమాణు ప్రమాణములో పరిమితము, స్థూలము అయిన తొలిరూపముతోడనే తన శాశ్వత అనంత పరమాత్మతో సాహచర్యము చేసి, తాదాత్మ్యము చెందునట్టి ప్రవృత్తిని సృష్టించుచున్నది.

117. ఇంతకు పూర్వము ఎట్టి అనుభవములేని ఆత్మ, తొలి సారిగా అనుభవమును పొందెను. కాని సంస్కారములు లేని, స్పృహలేని అనంత పరమాత్మయొక్క (A) స్థితితో తాదాత్మ్యతను చెందుటలో పూర్తిగా వ్యతిరేక అనుభవమునే పొందెను.

**118.** ఈ వ్యతిరేక అనుభవము వలన అనంతాత్మయొక్క శాశ్వత అఖండ నిశ్చల స్థితిలో మార్పు సంభవించెను.

**119.** ప్రథమ సంస్కారము, ప్రథమ చైతన్యము, ప్రథమ అనుభవము ఒకే నివృత్తిలో నుండెను.

సమ నివృత్తిలో పరిణామము

| సంస్కారము | చైతన్యము | అనుభవము |
| --- | --- | --- |

120. ఆత్మ, సంస్కారములందే స్పృహకలిగి యున్నచో, విధిగా యీ సంస్కారములను అనుభవించవలసినదే.

**121.** ఆత్మయొక్క చైతన్యము, సంస్కార అనుభవమును పొందుటకే రూపములను తీసికొనుచున్నది.

**122.** రూపము లేనిదే అనుభవము రాదు.

123. సమస్త అనుభవములకు సంస్కారములే కారణము.

124. భగవంతుడు రూపముతో తాదాత్మ్యత చెందుటకు సంస్కారములే కారణము.

125. రూపముల ద్వారా ప్రపంచానుభవమును పొందు చున్నది చైతన్యమే గాని ఆత్మకాదు. రూపముతో సహచరించి, ఆరూపమే తానని తాదాత్మ్యత చెందు చున్నది కూడా చైతన్యమే.

126. ఓం, బిందువు ద్వారా ఆవిర్భవించిన భగవంతుని అనంత దివ్య అంతశ్చైతన్యము (God's Infinite and Divine Sub-Consciousness), దివ్యస్వప్న (సృష్టి) స్థితిలో వేగము ప్రారంభమై పరిణామమందుచు ముందుకు సాగినది.

127. భగవంతుని అనంత దివ్యశూన్య స్థితినుండి, భగవంతుని అనంత దివ్య అంతశ్చైతన్యము, సృష్టి బిందువుద్వారా అనంతముగా బహిర్గతమైనప్పుడు దాని గమనవేగము ననుసరించి, సమస్త సృష్టియు ప్రమాణములో ఆ కృతిలో, రూపములో, రంగులో, క్రమక్రమముగా బయటికి చొచ్చుకొని వచ్చినది.

'గ్యాస్' వంటి వాయురూపములు.

128. ఈ తొలి రూపము, స్థూలమనికూడా భావించుటకు, ఊహించుటకు శక్యము గానంత స్థూల రూపము. దీనికి

ఆ కృతిలేదు. సారములేదు, పదార్థములేదు, రూపము లేదు.

(a) ఇచ్చట "గ్యాస్" వంటి రూపములు 7 కలవు. అందు మొదటి మూడును అనంతముగా నిరపేక్షమైన సాంద్రత గలవి.

(b) తరువాత మూడును నిరపేక్షమైన సాంద్రత గలవి. అవి సగము గ్యాస్, సగము పదార్థముగా (భూతము) నున్నవి.

(c) ఏడవది ఎలెక్ట్రాన్ వంటిది అని చెప్పవచ్చును. ఈ యేడును గ్యాస్ మాదిరి రూపములైనప్పటికీ పోలికలో వైజ్ఞానికు లుపయోగించు హైడ్రోజన్, నైట్రోజన్ వంటి వాయురూపములు మాత్రము కావు.



ఆవశ్యక అస్తిత్వము :—

**129.** భౌతిక సంబంధమైనవి అన్నింటితో కూడి యున్నది. పంచ ఆవిష్కరణములలో ఇది అయిదవది. ఈ యైదును పరాత్పరునిలోనున్న భగవంతుని పంచ ఆవిష్కరణ ములు. ఒక సద్గురువు లేక అవతారపురుషునియొక్క సార్వభౌమిక మనస్సుయొక్క సహాయము లేనిదే వీటి మర్మ మెవరికిని తెలియదు.

**130.** భగవంతుడు తన శాశ్వత అనంత అస్తిత్వమందు ఎఱుక కలవాడగుటకే, తానెవరో తనకు తెలియని (A) స్థితిలోనున్న భగవంతునిలో అనంతలీల చలించిన ఫలితమే,యాదృచ్ఛికమైన పరిణామము సంభవించినది.

**131.** పరమాత్మయొక్క ఎఱుకలేని (A) స్థితినుండి పొందిన చైతన్యము, పరమాత్మతో నైక్యమై, ఆ యైక్యము ద్వారా సత్యానుభవమును, పొందుటకు మారుగా, ద్వైతము ద్వారా స్థూల రూపములతో సహచరించి అసంఖ్యాక సంస్కారములను అనుభవించుచూ పరిణామము చెందుచున్నది.

132. ఇప్పుడు సచేతన స్థితియందున్న ఆత్మ వరూపము సహచరించి, వరూపము ద్వారా సంస్కారానుభవ పొందుచున్నది ?

133. సప్త ప్రధాన శ్రేణుల యొక్క అసంఖ్యాకమైన జాతు రూపాలను వినియోగించుకొని, విభిన్నమై అసంఖ్యాక సంస్కారములను అసంఖ్యాక యుగము అనంతరము సామాన్యులు ఊహించలేని దుర్గ్రాహ్యమగు 'గ్యాస్' వంటి వాయురూపముల అనంతరము, శిల రూపముతో సహచరించి, ఆ శిలారూపముతో తాదాత్మ్యత చెందినది. మన పీలుకొలువై, సృష్టి శిలారూపముతో ప్రారంభమైనదని చెప్పుకొనవచ్చును

134. భగవంతుడు దేహధారి గా, సృష్టియందు 'సచేతనుడగుటకును', సృష్టిని - 'తెలిసికొనుటకును' - ప్రారంభించును.

135. ఆత్మ, తనయొక్క చైతన్యముతో
సంస్కారములను
వాటికి తగిన రూపము ద్వారా
తత్సంబంధ లోకములలో
అనుభవమును పొందుచుండును.

**136.** పరమాణు ప్రమాణమైన ఈ ఎఱుకయు ఈ తెలిసి కొనుటయు, ఆత్మ బిందువు మొట్టమొదటి రూపము నుండి వియోగమొందుటకు కారణమగు హెచ్చు సంస్కారములను సృష్టించుచున్నవి.

**137.** ఆత్మ, కొంతకాలమునకు ఒక నిర్దిష్టమైన అనుభవమును పొందిన తరువాత, ఆ రూపమును విడిచి పెట్టుచున్నది.

**138.** పరిణామ క్రమములో, ఆత్మ, రూపమును విడిచిపెట్టి నప్పటికీ పరిణామ చైతన్యముచే సేకరించబడిన సంస్కారములు మాత్రము అదృశ్యమగుట లేదు.

**139.** రూపముల పరిణామము అనుభవములను పొందుటకు సహాయపడును.

**140.** చైతన్యము అంతకంతకు హెచ్చు స్థితిలో పరిణామ మొందుచుండగా, ఆత్మ, సంస్కారములను అనుభవించుచు వాటిని రద్దుపరచుటకు సాధనములైన పరిమిత స్థూలరూపములనుండి ఎఱుకతో దూరమగుచున్నది.

కానీ, తాను స్వయముగా ఎఱుకతోగాని ఎఱుక లేక గాని పరిమిత సూక్ష్మ- మానసిక దేహములనుండి వియోగ మొందుట లేదు.

## రూపములేని ఆత్మ.




141. ఆత్మకు స్థూలరూపము పోయినప్పటికీ, ఆత్మయొక్క చైతన్యము, పోయిన రూపముయొక్క సంస్కార అవశేషములను నిల్పియుంచును. ఇప్పుడు రూపము లేని ఆత్మ, గతరూపముయొక్క సంస్కారములందే ఎఱుక కల్గియున్నది. ఆ ఎఱుక ఉండుటచేత ఆ సంస్కారములను మరియొక నూతనరూపము ద్వారా అనుభవమును పొందుచుండును.

142. ఆత్మకు తాదాత్మ్యత నొందుటకు రూపము కావలెను. అంతవరకు ఆత్మయొక్క చైతన్యము, సంస్కారములయందే కేంద్రీకృతమై యుండును.

ఇప్పుడు ఆత్మ కొంతకాలముపాటు రూపములేకుండి, తనకు రూపము లేనట్లుకూడా అనుభవమును పొందుచున్నది.

143. ఆత్మయొక్క చైతన్యము, రూపముతో సహచరించియున్నప్పుడు (తాను అనంతము, శాశ్వతము, నిరా

కారము అయివుండి, పరమాత్మలో శాశ్వతముగా యున్నాననెడి సత్యమును పూర్తిగా మరచిపోయి) ఎఱుకతో ఆ రూపముతో గల తాదాత్మ్య తను పోషించుచూ నిజముగా ఆ రూపముతానేనని కనుగొనును.

144. రూపము పోయిన తరువాత, పోయిన రూపముయొక్క అవశేషములైన సంస్కారములు, తరువాతవచ్చు రూపముతో రద్దగు చుండును.

145. గత రూపముయొక్క అవశేషములైన సంస్కారముల ననుసరించియే, వాటికి తగిన, తరువాత రూపము తయారగు చుండును.

146. ఆత్మయొక్క చైతన్యము అసంఖ్యాక రూపములద్వారా అసంఖ్యాక సంస్కారముల అనుభవమును పొందు చుండును.

147. ఈ సంస్కారముల గొలుసు ఒకజాతియొక్క రూపము తరువాత మరియొక జాతిరూపముగా అనుభవమును పొందుచూ, బాహ్యముగా అంతులేనట్లుగా కనబడును.

148. గతరూపముయొక్క అవశేషములైన సంస్కారముల వలననే, ప్రస్తుత రూపము తయారగును. ఈ ప్రస్తుత రూపము ద్వారా గతరూపముయొక్క సంస్కారములు ఖర్చు అగుచుండును.

149. భగవంతుడు తన దివ్య స్వప్నములో సృష్టియొక్క వస్తుజాలముతో సహచరించుచు వాటితో తాదా

త్మ్యత చెందుటద్వారా, దివ్యస్వప్నములో చిక్కు కొనెను.

150. పరిణామములో ఆత్మ, ఎఱుకతో పరిమిత స్థూలరూపముతోడను, అత్యంత పరిమితములైన సూక్ష్మ- కారణ దేహములతో ఎఱుక లేకను, తాదాత్మ్యత చెందుచున్నది.

151. ఆత్మయొక్క పరిణామ చైతన్యము, పరిణామరూపములతో తాదాత్మ్యము చెందుచుండగా, ఇంకనూ యింకనూ సంస్కారములను సంపాదించుచున్నది.

152. ఆత్మ, సంస్కారములను ఖర్చుజేయుటకై వాటిని బహిర్గత పరచుటకు తగిన అవకాశమును చూచుకొని, భూమిపై ఆ సంస్కారముల అనుభవమును పొందుచున్నది.

153. స్థూల సంస్కారములు పెరుగుటతో చైతన్యముకూడా పరిణామమొందెను. స్థూలరూపముల పరిణామము గమనవేగమును పొందెను.

154. భగవంతుడు తనను తాను తెలిసికొనవలెననెడి ఆది ప్రేరణ ఫలితముగా, చైతన్య పరిణామము, స్థూలరూపముల పరిణామము, భౌతిక ప్రపంచానుభవముల పరిణామము సంభవించెను.

**155.** అఖిలభౌతిక సృష్టియొక్క పరిణామ ప్రగతి ననుసరించి ఇతర లోకములతో పాటు భూమికూడా పరిణామ మొందుచు వచ్చినది.

**156.** భౌతిక గోళము అసంఖ్యాక ప్రపంచములు, సూర్యులు, చంద్రులు, నక్షత్రములు ఇంతెందుకు చాలా మోటైన జడపదార్థమునుండి బహు సున్నితమైన భౌతికపదార్థము వరకు, వీటన్నింటితో కూడియున్నది.

**157.** ఆత్మయొక్క చైతన్యము, స్వయముగా పూర్ణముగా పరిణామము చెందగలందులకుగాను వేరే మార్గము లేక యీ సంస్కారముల సుడిగుండములో చిక్కుకు పోయినది. ఎంతవరకు ?

ఆత్మ, తాను, అనంతమనియు, శాశ్వతమనియు, పరమాత్మలో శాశ్వతముగా ఉన్నాననియు అనుభూతి నొంది, తన అనంత జ్ఞాన – శక్తి – ఆనందములను అనుభవించునంతవరకు.

**158.** పరిణామములో, ఆత్మలు తక్కువస్వరూపములను విడిచి పెట్టుచు, హెచ్చురూపములతో చేరుచున్నవి.

**159.** చైతన్య పరిణామము, రూప పరిణామమునకు సంబంధించినదేగాని ఆత్మలకు సంబంధించినదికాదు.

160. పరిణామ మొందుచున్న చైతన్యము, స్థూల రూపముల చైతన్యమేగాని, సూక్ష్మ - మానసిక దేహముల చైతన్యము మాత్రము కాదు.

161. పరిణామ ప్రక్రియలో, చైతన్యము పరిణామ మొందుటతో

రూపములు

లోకములు

సంస్కారములు

పరిణామ మొందుచున్నవి.

| రూపములు | లోకములు | సంస్కారములు |
|---|---|---|





**162.** నిద్రించిన మానవుడు (A), తన నేత్రములను మెల్ల మెల్లగా తెరచుటవంటిది. పరిణామ క్రమము.




**163.** ఆత్మయొక్క చైతన్యము సంపూర్ణముగా పరిణామ మొందిన తరువాత తొలిమానవ రూపముతో సంయోగ మందగనే, దాని పరిణామము పరిసమాప్తి చెందినది.

**164** ఆత్మయొక్క చైతన్యము సంపూర్ణముగా పరిణామ మొందిన తరువాతి మానవరూపముతో తాదాత్మ్యత చెందుట ప్రారంభించును.

165. పరిణామములో ఆత్మయొక్క చైతన్యము ఒక స్థూల రూపము ద్వారా కొన్ని యుగములపాటు భౌతిక ప్రపంచానుభవమును పొంది, యుగములనంతరము ఆ రూపమును విడిచి పెట్టి, ఇంకను హెచ్చు చైతన్యమును హెచ్చు అనుభవమును సంపాదించుటకై తాను విడిచి పెట్టిన రూపముకంటె మరియొక హెచ్చు, రూపమును తీసికొనుచున్నది. ఇట్లు:—

| | | |
|---|---|---|
| శిల | నుండి | లోహమునకు |
| లోహము | నుండి | వృక్ష సంతతికి |
| వృక్షముల | నుండి | క్రిమి, కీటకాదులకు |
| క్రిమి కీటకముల | నుండి | మత్స్యములకు |
| మత్స్యముల | నుండి | పక్షులకు |
| పక్షుల | నుండి | జంతువులకు |
| జంతువుల | నుండి | మానవునివరకు, |

రూపములను తీసికొన్నది. మానవరూపముతో పరిణామము ఆగిపోయినది.

166. అభావముయొక్క అత్యంత పరిమితమైన 'తొలిసంస్కారము' కారణముగా—

అనంతుడు,
సంస్కారములు లేనివాడు,
నిరాకారుడు,
శాశ్వతుడు

అయిన పరమాత్ముడు—తనను
పరిమితుడననియు,
అణుమాత్రుడననియు,
ప్రాణి ననియు,
జడము ననియు,
అనుభూతి నొందుచున్నాడు.

167. పరిణామ మొందిన చైతన్యము, సృష్టియొక్క అనుభవమును సంపాదించుచున్నప్పుడు—

ఆభాసము, నశ్వరము అయిన సృష్టిని యదార్థమైనదిగను, అనంతమైనదిగను, అనుభవము పొందుచున్నది.

168. దీనికి కారణము ?...... సంస్కారములే.
సమస్త అనుభవములకు సంస్కారములే కారణము.

169. రూప పరిణామము, చైతన్య పరిణామ మనెడి విశ్వకర్మాగారములో తయారగు వస్తువులు.

170. చైతన్యము మానవరూపమందే అనంతము కాగల్గును.

171. మానవ రూపము, రూపపరిణామము యొక్క అంతిమదశ.

172. ఆత్మ, అనంతమైనదిగాబట్టి, ఆత్మయొక్క చైతన్యము కూడా అనంతమగును.

173. ఒక్క మానవరూపమందే చరమముగా ప్రత్యగాత్మ తన మూల తత్త్వమైన పరమాత్మస్థితిని అనుభూతి నొంద గలదు.

174. భగవంతుడు తన దివ్యస్వప్నములో స్వయముగా సృష్టి యందలి వస్తుజాలముతో తాదాత్మ్యత చెందుచున్న ప్పుడు, "నేను ఎవడను ?" అన్నట్టి తొలిపలుకునకు శాహ్యమునకు నిజముగను, వాస్తవములో మిథ్య యైన యీ దిగువ సమాధానములు వచ్చెను.

నేను శిలను
నేను లోహమును
నేను వృక్షమును
నేను క్రిమిని, కీటకమును
నేను మత్స్యమును
నేను పక్షిని
నేను జంతువును
నేను పురుషుడను (లేక) స్త్రీని.

175. భగవంతుడు తన దివ్యస్వప్నములో స్వయముగా మానవరూపముతో తాదాత్మ్యత-చెందినప్పుడు ఆతడింక అర్ధస్పృహాలోనుండక, పూర్ణ చైతన్యము కలవా డయ్యెను.

Notes:— ప్రత్యగాత్మ (ప్రత్యక్ + ఆత్మ) పరమాత్మ నుండి వేరుపడిన ఆత్మ (Drop Soul)

176. మానవుని పూర్ణ చైతన్యము యావత్తు దివ్యస్వప్న మును చెదరగొట్టి, మానవునికి తాను భగవంతుడ ననెడి నిజమైన మెలకువ నిచ్చుటకు కారణమైనది.

177. ఆత్మ, ఒకసారి చైతన్యమును పొందిన తరువాత, ఆచైతన్యము అంత కంతకు వికాసమొందునేకాని, తరిగిపోదు.

178 మానవరూపము :

యుగ యుగానంతరము, చైతన్యపరిణామముతో పాటు పరిణామ మొందిన.

పూర్ణ రూపము
అత్యుత్తమ రూపము
విశిష్టరూపము
దివ్యరూపము

ఈ మానవరూపమే. ఈ మానవ రూపములోనే చైత న్యము పుష్కలముగా పూర్ణముగా అభివృద్ధి చెందినది.

ఇప్పుడు ఆత్మ, యీ పూర్ణరూపమును ఉపయో గించుకొని, యీ రూపము ద్వారా సంస్కారములను రద్దు పరచుకొనును.

179. మానవుడు
లేక
జీవాత్మ
లేక
ఇన్సాన్

} = శరీరము + ప్రాణము + మనస్సు + చైతన్యము + ఆత్మ.

180. విస్పష్టముగా చెప్పవలెనన్నచో, అసలు ఉన్నది ఒక్కటే రూపము అదియే, మానవరూపము. మానవ రూపము, పూర్వము దాటివచ్చిన దశలన్నింటిలో అంతర్నిహితమై యున్నది. రూపములుగా కాన్పించు తక్కిన రూపములన్నియు మానవరూపము యొక్క పరిణామ దశలు.

181. ఆత్మకు మానవరూపము లేకుండా, సూక్ష్మ - కారణ దేహముల చైతన్యముగాని, ఆత్మచైతన్యముగాని పొందుట దుర్లభము.

182. పరమాత్మానుభూతిని పొందుటకు కాంక్షించుచున్న ఆత్మ, మానవరూపము ధరించి పూర్ణ చైతన్యమును సంపాదించి నప్పటికీ, పరమాత్మానుభవమును పొంద లేకపోయినది - ఎందుచేత ?

ఆ - పూర్ణ చైతన్యము స్థూల సంస్కారములలో కేంద్రీకరించి యున్నంతకాలము స్థూల రూపముతోనే ఎఱుక కలిగియుండును కనుక విధిగా భౌతికలోకానుభవము పొందితీరవలసినదే.

183. తెలిసిన స్థితిలో (జాగ్రుతిలో) మనస్సే - మానవుడు.
దేహమే - మానవుడు,
తెలియని స్థితిలో (సుషుప్తిలో)మనస్సుకు దేహమునకు ఆవలి నున్న ఆత్మయే మానవుడు.

184. చైతన్య పరిణామములో సంస్కారములే, భగవంతునికి మానవస్థితియొక్క అనుభవమును కలుగజేసినవి.

185. చైతన్య పరిణామముతోపాటు, పరిణామ మొందిన సంస్కారములను, ప్రథమ సంస్కారమే పుట్టించినది.

186. అభావముయొక్క సంస్కారములద్వారా మానవునిలో చైతన్యము సంపూర్ణముగా పరిణామ మొందినది.

187. భగవంతుడు పరిణామములో పొందిన పూర్ణ చైతన్యము సంస్కార భూయిష్ఠమైనది.

188. మానవరూపములో స్థూల దేహముతోపాటు సూక్ష్మ కారణ దేహములు పూర్తిగా అభివృద్ధిని కలిగియున్నప్పటికీ, అభివృద్ధిచెందిన చైతన్యము భౌతికచైతన్యము.

189. మానవుని పరిమిత లక్షణములు.

పరిమిత మనస్సు:— వాంఛలు, తలంపులు

పరిమిత ప్రాణము:— వేగము, శక్తి

పరిమిత దేహము:— సుఖములు, కష్టములు.

190. మానవుని చైతన్యము, అభావముయొక్క సంస్కారములతో చాల సన్నిహితముగా లంకెపడియుండి, ఈ అయథార్థమైన అభావమును సర్వము గను, సత్యము గను ఎటులనో అనుభవింప చేయుచున్నది.

191. చైతన్యము లేకున్న (A భగవంతుడు, సృష్టిపరిణామము పొడవునను, క్రమ క్రమముగా హెచ్చు చైతన్యమును పొందుచు చివరకు మానవరూపములో పూర్ణ చైతన్యము కలవాడై, ఆమానవ రూపముతో తాదాత్మ్యత చెందు చున్నాడు.

192 మానవునిలో ప్రాణమయ, మనోమయకోశములు పుష్కలముగా పెరిగినప్పటికీ, భూతలముమీద, అవి మానవ స్థితిలో పరోక్షముగను, ఎఱుకలేకను నిర్విరామముగా, నిరంతరాయముగా నియమబద్ధముగా ఉపయోగింపబడు చున్నవి.

193. సంస్కారములలో చిక్కు వడిన చైతన్యమే జీవాత్మ.

194. మానవుడు భగవత్స్వరూపుడు

శీర్షాగ్రము :— విజ్ఞాన (7 వ) భూమిక
మహోన్నత ఆధ్యాత్మిక
అవస్థానము (లేక)
బ్రహ్మపీఠము.

ఫాలము,— దివ్యత్వ ప్రవేశము (6 భూమిక)

భ్రూమధ్యము:_అంతర నేత్రము
త్రినేత్రము } 5 భూమిక

నేత్రములు:_4 భూమిక

ముక్కు:_ 3, 2 భూమికలు

చెవులు:_ 1 భూమిక

నోరు:_ ప్రవేశ ద్వారము




1 నుండి 7 వరకు... సప్త ద్వారాల శిర.

195 మానవరూపములో ఆత్మయొక్క చైతన్యము సమగ్రము సంపూర్ణము అయినది. చైతన్య పరిణామములో మానవరూపము అత్యుత్తమ రూపము, దివ్యరూపము యుగ యుగములకు తయారైన పరిపూర్ణరూపము.

196. స్థూల చైతన్య పరిణామము మానవరూపమును పొందుటతోడనే సమాప్తమైనది.

# పరిణామ పట్టిక

<table>
<tr><th>రూప పరిణామము</th><th>సంస్కారములు</th><th>చైతన్యము</th><th>స్థూల దేహము</th><th>ప్రవృత్తి లేక, సహజాతము</th><th>ప్రాణము</th><th>మనస్సు</th></tr>
<tr><td>రాళ్ళు లోహములు</td><td rowspan="8">క్రమాభివృద్ధి</td><td rowspan="8">క్రమాభివృద్ధి</td><td rowspan="8">క్రమాభివృద్ధి</td><td>లేదు</td><td>లేదు</td><td>లేదు</td></tr>
<tr><td>వృక్షజాతి</td><td>అభివృద్ధి కాని సహజాతము</td><td>లేదు</td><td>లేదు</td></tr>
<tr><td>క్రిములు కీటకములు</td><td>అభివృద్ధి</td><td>అభివృద్ధి లేదు</td><td>లేదు</td></tr>
<tr><td>చేపలు</td><td>అభివృద్ధి</td><td>అభివృద్ధి</td><td>లేదు</td></tr>
<tr><td>పక్షులు</td><td>అభివృద్ధి</td><td>అభివృద్ధి</td><td>లేదు</td></tr>
<tr><td>జంతువులు</td><td>పూర్తిఅభివృద్ధి పాక్షిక అభివృద్ధిగల బుద్ధి</td><td>అభివృద్ధి</td><td>లేదు</td></tr>
<tr><td>మానవుడు</td><td>బుద్ధి</td><td>పాక్షికముగా వాంఛలు వ్యక్తము<br>సంపూర్ణము</td><td>మనస్సు, బుద్ధి వాంఛలు, అనుభవము *</td></tr>
</table>

## పరిణామము

స్థూల దేహముంగు
ఎఱుక కలిగియున్న
మానవుడు




197. భగవంతుడు మానవస్థితిలో, పూర్తి ఎఱుకను కలిగి యున్నప్పటికీ, తాను పరాత్పరుడ ననెడి అనుభవమును పొందక, మానవ స్థితిలోనున్న ఒక మానవుడననియు, అనంతుడను కాదనియు, పరిమితుడననియు అనుభూతి నొందుచున్నాడు.

మానవరూపములో
పునర్జన్మలను
పొందుచున్న
మానవుడు.



భగవంతుని
ఆరవపాత్ర

# మానవరూపములో పునర్జన్మలు
## (సంసార చక్రము)




**198.** మానవుడు తన సంస్కార భారమును, వాటికి భిన్నమైన సంస్కారముల ద్వారా తగ్గించుకొనుటకు శ్రమపడును. ఈ శ్రమయే పునర్జన్మ క్రమము.

**199.** మానవరూపము వరకు ప్రోగుపడిన సంస్కారములు పునరావృత్తి క్రమమందును, ఆధ్యాత్మిక అనుభూతి క్రమమందును భిన్న సంస్కారములచే రద్దగును.

**200.** సంస్కారములు రద్దగుటకే, పునర్జన్మ క్రమము ఆధ్యాత్మిక మార్గము (అంతర్ముఖ క్రమము) ఒకదాని వెంబడి మరి యొకటిగా, అనుసరింప బడుచున్నవి.

201. తొలి మానవరూపము ద్వారా, జంతుశ్రేణిలో చివరి జంతువుయొక్క సంస్కారము లన్నింటిని ఖర్చుపెట్టిన తరువాత, ఆత్మయొక్క చైతన్యము తొలిమానవ రూపమును విడిచి పెట్టుట సహజము.

202. చైతన్యము తొలిమానవ రూపము నుండి వియోగమం నప్పటికీ, తెలియకనే సాహచర్యమును పొందుచున్న సూక్ష్మ - కారణ దేహములనుండి ఎన్నడూ వియో మొందుట లేదు.

203. సూక్ష్మ - కారణ దేహములు, విడువబడిన గత భౌతిక రూపము యొక్క సంస్కారములను నిల్పియుంచినవి.

204. పూర్వజన్మ సంస్కారములను అనుభవించుటకే, ఆత్మ మరియొక రూపముతో సహచరించుచున్నది

205. పూర్వజన్మ సంస్కారముల సంపుటియే ప్రస్తుత జన్మకు రూప మిచ్చును.

ఏల పునర్జన్మము కావలసి వచ్చినది ?

206. తొలిమానవరూపము యొక్క, మానవరూపమునకు పూర్వమందున్న పరిణామరూపములయొక్క సంస్కారములను అనుభవించుటకే, ఆత్మ, మానవరూపములో మరల మరల పునర్జన్మములను పొందవలసి వచ్చినది.

207. ఆత్మ, మానవరూపములో ఒకసారి పునర్జన్మమును పొందుటకు ప్రారంభించిన తరువాత, 84 లక్షల మానవ రూపముల ద్వారా పోవలసి వచ్చును.

208 స్థూల సంస్కారము లున్నంతకాలము ఆత్మకు, సూక్ష్మ-కారణ దేహముల చైతన్య ముండదు.

209. ఆత్మ, పూర్ణ చైతన్యమును కలిగియున్నప్పటికీ, స్థూల సంస్కారము లున్నంత కాలము అసంఖ్యాక మానవ రూపములను ధరించును.

210. ఆత్మ, భౌతిక సంస్కారములను కలిగియుండి, వాటి కనుగుణ్యమైన స్థూల శరీర చైతన్యమునే కలిగియుండి, భౌతిక ప్రపంచానుభవమును పొందుచుండును.

భౌతిక లోకానుభవము:—

వినుట,

ఆఘ్రాణించుట

చూచుట,

తినుట

నిద్రపోవుట

మల, మూత్రములు విసర్జించుట.

211. సంస్కారములు — దేహములకు ఉనికిపట్టు

దేహములు — లోకములకు ఉనికిపట్టు

212. చైతన్యము అసంఖ్యాక మానవరూపముల ద్వారా అనుభవములను సంపాదించుటవలన, సంస్కారముల బిగువు సడలి, పలుచనగుటకు ప్రారంభించును.

ప్ర॥ మానవజన్మనుండి క్రింది జన్మలకు దిగజారుట సంభవమా ?

**213.** సంభవముకాదు. ఎందుచేతననగా, చైతన్యము మానవ రూపము చేరుసరికి పూర్ణమైనది. ఒకసారి పూర్ణచైతన్యము లభించి మానవ రూపముతో తాదాత్మ్యతను చెందిన తరువాత, అది ఎన్నటికిని తరిగిపోదు.

**214.** ఆత్మ స్థూల రూపమును ఎఱుకతో విడిచినప్పటికీ, సూక్ష్మ - కారణ దేహములను ఎఱుకతోగాని, ఎఱుక లేకగాని విడుచుట లేదు.

**215.** ఆత్మ, తొలిమానవ రూపమునుండి వియోగ మొందినప్పటికి, తన సూక్ష్మ - కారణ దేహములనుండి మాత్రము వియోగ మొందుట లేదు.




**216.** స్థూలదేహ చైతన్యముకల మానవునకు, ఆతనిసూక్ష్మ-కారణ దేహములు పరోక్షముగను, ఆతనికి తెలియకుండగను ఉపయోగపడుచున్నవి.

**217.** స్థూల దేహ చైతన్యముగల మానవునకు, సూక్ష్మ - కారణ దేహములందు ఎఱుక లేకున్నను, ఆతని ప్రాణము (Energy) వివిధ భౌతిక లక్షణములుగల అణుశక్తిగను,

ఆతని మనస్సు-వాంఛలు, భావోద్వేగములు,తలంపులు అనెడి లక్షణములుగను ఉపయోగపడుచున్నవి.

218. ప్రాణశక్తి యొక్క భౌతిక లక్షణములు:—

వాంఛలు

మానసికోద్వేగములు

తలంపులు.

219. మనస్సు యొక్క ప్రబల లక్షణము :—వాంఛలు.

220. భౌతిక మరణానంతరము, సూక్ష్మ - కారణ దేహములను చేరియున్న చైతన్యము అనుభవించు తీవ్రాతి తీవ్రమైన అనుభవములే స్వర్గనరకములు అనెడి మానసికస్థితులు గాని, అవి లోకములు కావు.

221. మరణించిన మానవులు సజ్జనులుగాని లేక దుర్జనులు గాని, స్వర్గ - నరకము లనెడి స్థితిలో పునర్జన్మము పొందువరకును వేచియుందురు.




222. స్వర్గ – నరకము లనెడి మానసికస్థితు లనుభవించునది ఆత్మయొక్క చైతన్యమేగాని, ఆత్మకాదు.

223. సంస్కారముల అనుభవమును పొందుచున్నది కూడా ఆత్మయొక్క చైతన్యమేగాని, ఆత్మకాదు.

224 సూక్ష్మ శరీర చైతన్యముగల మానవునకు, సూక్ష్మ శరీరము ప్రత్యక్షముగను, ఎఱుకతోడను పనిచేయు చున్నప్పటికీ, ఆతని మనశ్శరీరములు పరోక్షముగను ఎఱుక లేకను ఉపయోగపడుచున్నవి.

225. మానసిక శరీర చైతన్యము కలవానికి, ఆతని స్థూల - సూక్ష్మ దేహములు పరోక్షముగను ఎఱుక లేకను ఉపయోగపడుచున్నవి.

ఆత్మయొక్క ఎఱుక
దేహముల వినియోగము.

226.

| దేహములు ఉపయోగ పడుట | స్థూల దేహమందు ఎఱుక గల ఆత్మ | సూక్ష్మ దేహమందు ఎఱుక గల ఆత్మ | మనస్సుయందు ఎఱుక గల ఆత్మ |
|---|---|---|---|
| 1. స్థూల దేహము | ప్రత్యక్షము | పరోక్షము | పరోక్షము |
| 2. సూక్ష్మ దే॥ | పరోక్షము | ప్రత్యక్షము | పరోక్షము |
| 3. కారణ దే॥ | పరోక్షము | పరోక్షము | ప్రత్యక్షము |

227. జననము.

ఆత్మ, స్థూలరూపములద్వారా, భౌతిక ప్రపంచానుభవమును పొందుచున్నప్పుడు, అసంఖ్యాక రూపములతో సహచరించుచుండును. దీనినే జననము అందురు.

228. ఆత్మ, స్థూలరూపముల ద్వారా, భౌతిక ప్రపంచానుభవమును పొందుచున్నప్పుడు, అసంఖ్యాక రూపముల నుండి వియోగమందుచుండును. దీనినే మరణము అందురు.

229. సాధారణముగా మరణము సమీపించు ఘడియలందు సూక్ష్మ శరీరమును, జీవశక్తియు స్థూల దేహమునుండి పూర్తిగా వేరగును. కాని స్థూల దేహముతోగల సంబంధమును మనస్సు, మరణానంతరము 5 రోజుల వరకు కాపాడును. మరియొకప్పుడు 5 రోజుల తరువాత 7 రోజులవరకు యీ సంబంధమును కాపాడును.

230. ఆత్మ, భౌతికలోకానుభవమును పొందుచున్నప్పుడు, జనన – మరణములు; కష్ట – సుఖములు; పుణ్య – పాపములు, మొదలైన ద్వంద్వానుభవములు అన్నింటిని, ఈ స్థూల రూపమే పొందుచున్నది.

231. ఆత్మకు స్థూలరూపము నీడవంటిది

232. ఆత్మ పొందుచున్న అనుభవములన్నియు, తనకు నీడయైన స్థూలరూపానుభవములేకాని, ఆత్మకు ఎట్టి అనుభవము లేదు.

233. సంస్కారముల కారణముననే, ఆత్మ, శరీరములే తానను అనుభవమునుపొందుచున్నది. ఈ అజ్ఞానమునకు కారణము, సమస్త అనుభవములకు కారణము... ఈ సంస్కారములే.




234. రూపములేని ఆత్మ,
జనన_మరణములు లేని ఆత్మ;
అనంతమైన ఆత్మ;
శాశ్వతమైన ఆత్మ;
కష్ట - సుఖములు
సుఖ - దుఃఖములు

మొదలగు ద్వంద్వములకు అతీతమైన ఆత్మ తనకు-
రూపమున్నదనియు,
జనన-మరణములు పొందుచుంటిననియు,
పరిమితిగల దాననియు,
అనిత్యమైన దాననియు;
కష సుఖములు
పుణ్యపాపములు - పొందుచుంటిననియు

## అనుభవమును పొందుటకు సంస్కారములే కారణము.

ఈ అజ్ఞానమునకు కూడా సంస్కారములే కారణము. ఈ ద్వంద్వ అనుభవము లన్నియు స్థూల రూపమే పొందుచున్నది.

235. పరమాత్మకు భౌతిక ప్రపంచము నీడవంటిది. కాబట్టి లోకానుభవము లన్నియు, అయదార్థమైనవి.

236. పూర్వజన్మ సంస్కారముల వలననే ప్రస్తుత జన్మలయా రగును. ఈ ప్రస్తుత రూపము ద్వారా పూర్వ జన్మ సంస్కారములు అనుభవింపబడి ఖర్చు అగుచుండును.

237. ఆత్మయొక్క చైతన్యము సంస్కారములలో కేంద్రీ కరించి యున్నంతకాలము, ఆ సంస్కారానుభవ మును పొందవలసినదే.

238. పునర్జన్మ ప్రక్రియలో, పూర్ణ చైతన్యముగల మాన వాత్మ విధిగా అసంఖ్యాకమైన వివిధములైన ద్వంద్వ సంస్కారముల అనుభవమును సంపాదించవలెను కనుక యీ మానవాత్మ, అసంఖ్యాకమైన సార్లు

స్త్రీగను - పురుషునిగను
వేర్వేరు కులములలో
వేర్వేరు జాతులలో
వేర్వేరు తెగలలో
వేర్వేరు రంగులలో
వేర్వేరు ప్రదేశములలో

| | |
|---|---|
| ఒకప్పుడు | ధనికునిగను |
| మరియొకప్పుడు | దరిద్రునిగను |
| ఒకప్పుడు | ఆరోగ్యవంతునిగను |
| మరొకప్పుడు | అనారోగ్యవంతునిగను |
| ఒకప్పుడు | సుందరుడుగను |
| మరొకప్పుడు | కురూపిగను |
| ఒకప్పుడు | పొడగరిగను |
| మరియొకప్పుడు | పొట్టివానిగను |

ఇట్లు అసంఖ్యాక సంస్కారములను అనుభవించుచు వ్యతిరేక సంస్కారములను సృష్టించుకొనుచు ఏకకాలమందే వాటిని రద్దుగావించుచుండును.

## సంస్కారముల ప్రభావము.

239. కర్మల వలన సంస్కారము లుదయించి మనస్సుపై ముద్రింపబడుచున్నవి. సంస్కారములే కర్మలను చేయించును. ఇట్లు సంస్కారములపై కర్మలు, కర్మలపై సంస్కారములు పరస్పరము ఆధారపడియున్నవి.



సినిమా:—

240. ● కర్మలు......... జాగ్రదవస్థలో దైనందిన వ్యావహారిక జీవితము
↓
● సంస్కారములు... ఫోటోలు
మనస్సు......... ఫిలిం
చైతన్యము......... వెలుగు ఫోకస్
సూక్ష్మశరీరం...... ప్రొజెక్టరు
↓
● కర్మలు......... తెరపై ప్రదర్శనము.

241. ఎందుచేతననగా... సంస్కారములు కర్మలచే రద్దగుచున్నవి. సంస్కారములు కర్మలను చేయించుచున్నవి.

242. సంస్కారములు పూర్తిగా రద్దు అగువరకు, అవి మానవ జీవితములో ప్రధానపాత్ర వహించుచున్నవి.

243. మానవుని మనస్సుపై సంస్కారములు నిల్చియుండి, మానవ చైతన్యమును ముద్రవేసినంతకాలము, మానవుని ప్రాణశక్తిచే పుట్టించబడి పనిచేయబడుచున్న యీ సంస్కారములు ఆతని మనస్సుపై నిరంతరాయముగా ముద్రింపబడుచూ, ఆతని అర్థ జాగృతిలో నిల్వ చేయబడు చుండును.

244 కొన్ని సంస్కారములు, మానవుని అర్థజాగృతిలో గంటలతరబడి, లేక రోజుల తరబడి లేక, ఏండ్ల తరబడి ఒక్కొక్కప్పుడు జీవిత పర్యంతము - నిద్రాణమై మిగిలి యుండును.

కాని వాటిలో హెచ్చుసంస్కారములు అనుక్షణము అంతశ్చైతన్యము ద్వారా మానవుని జీవితములో, స్వప్నావస్థలో అరస్పృహతోడను జాగ్రదవస్థలో పూర్తి స్పృహతోడను పొటమరింపబడుచూయుండును.




పూర్తి మరపు.
సంస్కారములు నిద్రాణమై యున్నవి.
చైతన్యము లేదు.




సగమేలుక.
పూర్తిగా సూక్ష్మముగాని
పూర్తిగా స్థూలముగాని,
కానట్టి రూపములు.




స్థూల రూపములు
పూర్ణ చైతన్యము
పూర్తి స్పృహ.

245. స్థూల - సూక్ష్మ - కారణ దేహములు మానవ చైతన్యముపై తమ 'పట్టు'ను వదలుటకు పూర్వము, వాని దైనందిన జీవితములో ప్రతిదినము, 'నిద్రించుట', 'మేల్కొనుట' అనెడి ఒక ప్రబల అనుభవమున్నది.

ఈ మూలానుభవము వాని నిత్యజీవితములో మూడు ప్రధాన స్థితులను కలుగజేయుచున్నది.

I సుషుప్తి అవస్థ:— మానవునిలోనున్న ఆత్మయందు స్పృహ లేకుండుట.

II స్వప్నావస్థ:— సగమెలుక (లేక) అర్థ స్పృహ కలిగియుండుట

III జాగ్రదవస్థ:— పూర్తిగా మేల్కొని యుండుట. మానవునిలో మానవునిగా పూర్ణ చైతన్యము.

246. సూక్ష్మేంద్రియములద్వారా పొందిన భౌతికవిషయానుభవములే స్వప్నములు.

247. సంస్కారములు మానవుని,

సుషుప్తి అవస్థలో ...... పూర్తిగా నిద్రాణమై నిల్చి యుండును.

స్వప్నావస్థలో......... అంతశ్చైతన్యము ద్వారా పైకి లేచినప్పుడు ప్రారంభ దశలలో సూక్ష్మ రూపములుగా వ్యక్తమగును.

జాగ్రదవస్థలో......... సుస్పష్టముగా స్థూలరూపములుగా అనుభవమునకు వచ్చును.

248. సృష్టి అంతయు భగవంతుని స్వప్నము.

249. భగవంతునిలో "నేను ఎవడను ?" అనెడి స్వీయమైన అనంతలీల చలించిన తక్షణమే, యీ సృష్టిలో జరుగుచున్నట్లు, జరిగినట్లు, జరుగునట్లు కనిపించునదంతయు, ఆతడు కలగనెను.

నిజమునకు ఏమియు జరుగలేదు.

స్వప్నములు - జీవిత అనుబంధ సంబంధములు.

250. పైకి లేచిన మానవుని నిద్రాణసంస్కారములచే నటించబడుచున్న 'నాటకమే' కల.

251. సామాన్య మానవుడు స్వప్నములలో, తన సూక్ష్మ శరీరము (ప్రాణము)ను సూక్ష్మచైతన్యముతో పాక్షికముగా వినియోగపడునట్లు చేయును. అచైతన్య-భౌతిక పదార్థములు భౌతికఅనుభవము సందర్భములో మాత్రమే.

252. మానవుడు మేల్కొనినప్పుడు, పైకి లేచిన అభావము యొక్క సంస్కారములు సృష్టి (ఆభాసము) యొక్క అదే కలను, ఇంకను తీవ్రముగను నిజముగను, వ్యక్తపరచును.




**253.** మానవుని అర్థస్పృహ ద్వారా యీ సంస్కారములు పైకి లేచినప్పుడు కలలో అస్పష్టమైన సూక్ష్మరూపములుగా వస్తువులను ప్రాణులను సృష్టించు చున్నవి.

సినీఫిల్ము ... మనస్సు
ఫొటోలు ... నిద్రాణసంస్కారములు
తెరపై ప్రదర్శనము "కల" అనెడి
డ్రామా.

**254.** మానవుడు స్వప్నావస్థలో, స్వప్ననాటకములో తనకు లోని తాను ఆ నాటక కర్తగను, కథానాయకునిగను పాత్రలు ధరించుటయేగాక తన స్వప్ననాటకములో సూక్ష్మాతి సూక్ష్మరూపములుగానున్న వస్తువులతోను

ప్రాణులతోను సన్నిహితముగా హత్తుకొని వుంటు న్నాడు. ఈ సూక్ష్మరూపముల సృష్టి కేవలము మానవుని పూర్వ, ప్రస్తుత జన్మల యొక్క స్వీయ సంస్కారముల వ్యక్తీకరణ ఫలితమే.

255. స్వప్నావస్థలో తాను చూచిన రూపములను, కలిసికొన్న రూపములను మెలకువవచ్చిన తరువాత స్మృతికి తెచ్చుకొన్నప్పుడు, అవి, ప్రస్తుత జీవితములో తాను ఏరోజు కారోజు స్థూలరూపములలో నున్న వస్తువులను ప్రాణులను మానవులను ఎటుకతో కలిసికొన్న సమావేశములను గుర్తుకు తెచ్చుచున్నవి. అంతియేకాక, వెంటనే వచ్చు జన్మములోగాని, లేక, కొంతకాలము గడచిన తరువాత వచ్చు జీవితముయొక్క సంబంధ – అనుబంధములను కూడా స్థాపించుచుండును.

భవిష్యత్సంబంధములు :

256. కొంతకాలము గడచిన తరువాత, తన జీవితములో యిది వరకెన్నడు చూచియుండనివారిని చూచును; కలిసికొని యుండనివారిని కలిసికొనును. వీరెవరో తనకు తెలియదు కాని తాను పూర్వమొకప్పుడు స్వప్నములో చూచిన ఆవస్తువులే యివి, ఆ ప్రాణులే యివి, ఆవ్యక్తులే వీరు.

257. మానవుడు ముందు ముందు (భావిలో) కలిసికొనవలసిన వ్యక్తులను కూడా ముందుగనే (పూర్వమే) స్వప్నావస్థలో కలిసికొనును.

258. స్వప్న నాటకము, గతజన్మ యొక్కయు, ప్రస్తుత జన్మ యొక్కయు దైనందిన జీవిత సంస్కారముల ఫలితమైనప్పుడు, స్వప్న నాటకములో భవిష్యత్సంబంధమైన రూపములకు, సంఘటనలకు మానవుడు ముందుగనే సాక్షీ భూతుడగుట ఎట్లు సాధ్యము ?

259. జాగ్రదవస్థలో – తాను సరిగా అన్వేషించినవి, సన్నిహితముగా కలిసికొన్నవి (వస్తువులు, మానవులు) స్మృతికి వచ్చినప్పుడు, అవి, గతములో కొన్ని రోజుల క్రితమో, కొన్ని నెలల క్రితమో లేక, కొన్ని సంవత్సరములకు పూర్వమో తన స్వప్నగత దృశ్యములేనని గుర్తుకు తెచ్చుకొని, గతమునకు సాక్షీ భూతుడగుచున్నాడు.

260. గతమే, వర్తమానముగా ప్రతిబింబించుచున్నది. ఇట్లు మానవుడు స్వప్న నాటకములో చిక్కుకుపోయి, తన గతమును వర్తమానముగా పరీక్షించుచు గతములోనే లీనమౌచున్నాడు.

261. మానవుడు తన భావిజీవితములోగాని, యీ జన్మలో భవిష్యత్తులోగాని తాను కలిసికొనబోవు – వస్తువులను మానవులను, స్వప్నములో చూచుచున్నాడు: కలిసికొనుచున్నాడు ప్రస్తుత జీవితములో – జాగ్రదవస్థలో, ఆ స్వప్నగత రూపములే తిరిగిస్థూలరూపములుగా కన్పించినప్పుడు నిజముగా తాను గత స్వప్న దృశ్యములకు సాక్షీ భూతుడగుచున్నాడు.

262. మానవుడు తనలో నిద్రాణమైయున్న స్వీయ సంస్కార
ములచే యేర్పడిన స్వప్నసృష్టిని, వర్తమాన జాగ్రత్
జీవితములో పోషించిన వాడై యున్నాడు.

ఇట్లు స్వప్ననాటక సృష్టికి, కర్తయై ఆ స్వప్న
గత దృశ్యములను జాగ్రదవస్థలో వర్తమానముగా
పోషించుచు భర్తయూ యున్నాడు.

గతమునకు వర్తమానము భవిష్యత్తు గనుక ఏక
కాలమందే భవిష్యత్తును కూడా స్థాపించిన వాడై
యున్నాడు.

263. వర్తమానములోనే - భూత, భవిష్యత్తులు రెండును
ఇమిడియే యున్నవి. మనము వర్తమానములో జీవించి
యున్నాము. గనుక ప్రస్తుతములో మనకు గతము లేదు,
భవిష్యత్తు లేదు. ప్రస్తుతము మనము జీవించియున్న
వర్తమానము రేపటికి, గతముగ లయమగు చున్నది.
ఇట్లు మానవుడు లయకారుడగు చున్నాడు.

264. మనకు వర్తమానమే యున్నది. నిన్న లేదు రేపు
లేదు. నేటి వర్తమానము గతమునకు భవిష్యత్తు. గత
మునకు భవిష్యత్తు అయిన వర్తమానమే, భవిష్యత్తుకు
గతము అగుచున్నది అనగా- నేటి వర్తమానముకూడా

Notes :—లయము = నాశనము.

కర్త = జగత్కర్త (Creator) = ఈశ్వరుడు

ఈశ్వరుడు = మాయాశబలిత బ్రహ్మము.

రేపటికి యుండదు. లయమై పోవుచున్నది. అనగా - గతము, భవిష్యత్తుకూడా గళించి పోవుచున్నవి. వర్తమానమే నిల్చియున్నది.

**265.** In the Eternity of Existence there is **NO** Time. There is **NO** Past and **NO** future.

( Page 86, Para 6. GDS )

**266.** "శాశ్వత అస్తిత్వములో కాలములేదు. అచ్చట భూత భవిష్యత్తులు లేవు.




**267.** నిత్య వర్తమానము:

| ఆది | సోమ | మంగళ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|
| నిన్న | నేడు | రేపు | | | | |
| | నిన్న | నేడు | రేపు | | | |
| | | నిన్న | నేడు | రేపు | | |
| | | | నిన్న | నేడు | రేపు | |
| | | | | నిన్న | నేడు | రేపు |
| | | | | | నిన్న | నేడు |
| | | | | | | నిన్న |

268. ఈ విధముగా మానవునిలో, నిద్రాణమైయున్న సంస్కారముల వ్యక్తీకరణ ఫలితముగా సృష్టి - స్థితి - లయములు, భూత - భవిష్యద్వర్తమానములు, జీవిత అనుబంధ సంబంధములు యేర్పడు చున్నవి.

269. భగవంతుడు మానవరూపములో (మానవునిగా) సృష్టి - స్థితి - లయ కారుడైన జగత్కర్త పాత్ర ధారి యౌచున్నాడు.

270. శాశ్వత అస్తిత్వములో కాలము లేదు. భూతభవిష్యద్వర్తమానములు లేవు; నిత్యవర్తమానమే ఉన్నది. శాశ్వ తత్వములో ఎన్నడును ఏమియు జరుగలేదు, ఎన్నడును ఏమియు జరుగబోదు. నిత్యవర్తమానమందే అంతయు జరుగుచుండును.

271. బాహ్యమునకు సృష్టిలో ఏదైనను జరిగినట్లు, జరుగు చున్నట్లు, జరుగబోవునట్లు కనిపించినచో, అది యంతయు, భగవంతుడు "నేను ఎవరిని ?" అన్నట్టి తన స్వీయమైన అనంత భగవద్విలాసము తరంగ చలిత మైన క్షణికములో భగవంతుడు కనిన దివ్యస్వప్నము తప్ప మరేమియు కాదు.

Notes:—జగత్కర్త = ఈశ్వరుడు; పరమేశ్వరుడు = God, The Beyond

**272.** భగవంతుడు, తన దివ్యమూలమైన అనంత దివ్యస్వప్నములో శాశ్వతముగా ఏక కాలమందే సృష్టి - స్థితి - లయకారుల పాత్రలను నిర్వహించుచున్నాడు.

త్రిమూర్తులు:

**273.** భగవంతుడు మానవస్థితిలో మానవునిగా, మానవునిలో నిద్రాణమైయున్న సంస్కారములద్వారా తన స్వీయ సృష్టికి, తానుకర్తయైన బ్రహ్మగను; బయటికి చిమ్మిన సంస్కారములద్వారా మానవుని దైనందిన జీవితములో, తనస్వీయ సృష్టిని పోషించుటలో స్థితికారుడైన విష్ణువుగను, వ్యతిరేక సంస్కారముల ద్వారా పోషించుచున్న స్వీయసృష్టిని నాశనమొనర్చుటలో లయకారుడైన మహేశ్వరునిగను;— ఇట్లు సృష్టి - స్థితి - లయకారుడైన జగత్కర్త (ఈశ్వరుడు)గా, తనవిజయమును ధృవపరచుచున్నాడు.

**274.** (1) నిద్రాణ సంస్కారముల... ద్వారా... సృష్టిని,
(2) జాగృతిలో నిత్య జీవితము } ... ద్వారా ... స్థితిని,
(3) సుషుప్తిలో వ్యతిరేక సంస్కారముల } ... ద్వారా... లయమును
అనుభవించుటద్వారా జగత్కర్తయగుచున్నాడు.

Notes:— జగత్కర్త = God, The Creator.

**275.** భగవంతుడు మానవునిస్థితిలో నిత్యము సంస్కారముల ద్వారా సృష్టి - స్థితి - లయములైన ప్రధాన ధర్మములను నిరూపించుచున్నాడు. ఇది, జగత్కర్త పాత్రను నిర్వహించుచున్న భగవంతుని స్థితి.

**276.** భగవంతునియొక్క దివ్యసుషుప్తిలో నిద్రాణమైన సంస్కారముల ద్వారా సచరాచర సమన్వితంబైన మాయ సృష్టింపబడి, భగవంతుని దివ్యస్వప్నమైన వర్తమానములో పోషింపబడి, దివ్య జాగృతియైన భవిష్యత్తులో నాశనమగుచున్నది.

అనగా-

మానవరూపములోనున్న భగవంతుడు, దివ్యత్వసిద్ధిని బడయుటతో మాయా సృష్టి నాశన మగుచున్నది.

**277.** సృష్టిలో :- స్థితి - లయములు
స్థితిలో :- సృష్టి - లయములు
లయములో :- సృష్టి - స్థితులు

పరస్పరాశ్రితములై యున్నవి.

**278.** మానవుడు స్వప్నావస్థ యందున్నప్పుడు, భూత - వర్తమాన - భవిష్యద్రూపములతో కలియుచున్నాడు. అతడు సమావేశములను సృష్టించుట, వాటిని పోషించుట, వాటిని నాశనము చేయుట అనెడు పాత్రలను సృజించుచున్నాడు. ఇవ్విధముగా మానవుడు ఎల్లప్పుడు వీటన్నింటికి, స్వప్నమునకు భవిష్యత్తు అయిన వర్తమానముతో సాక్షీ భూతుడై యున్నాడు

279. ఈపై ఆధారములనుబట్టి, స్వప్నములోగాని మెలకువలోగాని, సృష్టింపబడినవి, పోషింపబడినవి వర్తమానములో అడుగడుగునకు తప్పనిసరిగా నాశనము కావలసిన భవిష్యత్తు పొంచియే యున్నది.

200. ఏ వస్తువునకైనా ఆది ఎప్పుడున్నదో, దాని అంత్యము కూడా తప్పనిసరిగా అప్పుడే ఉన్నది.







Notes:— ఆద్యంతములు రెండును ఒకేమాదిరిగా, ఒకే ప్రమాణములో ఒకే రీతిగా నుండును. సూర్యోదయ, సూర్యాస్తమయములు కూడా ఒకే మాదిరిగా, ఒకే ప్రమాణములో జరుగుచుండును.

**281.** మానవుడు నేడు తాను జీవించియున్నానని ఉద్ఘా
టించుచున్నాడు. అనగా - తనకు తెలియకనే, నేటి
వర్తమానములో గతమును పోషించుచు, పరమును
(భవిష్యత్తు) కూడా వర్తమానములో స్థాపించి, వర్త
మానమందే పూర్వాపరములను (భూత, భవిష్యత్తు
లను) పోషించుచున్నాడు. అతని గతమునకు నేటి
వర్తమానము, భవిష్యత్తుగ నున్నది. రేపటి భవిష్యత్తు
వర్తమానమగును నేటి వర్తమానము రేపటి భవిష్య
త్తుకు గతము అయిపోవును కనుక, నేటివర్తమాన
మందే ఇటు గతించిన భూతకాలమును, అటు రాబోవు
భవిష్యత్కాలమును ఇమిడియే యున్నవి.

ఇట్లు ఎప్పటికప్పుడు భూత, భవిష్యత్తులు అదృశ్య
మగుచున్నవి. వర్తమానమే నిలిచి యున్నది. గత
మును వర్తమానములో పోషించుట, వర్తమానములో
పోషింపబడుచున్నది భవిష్యత్తులో నాశనమగుట
జరుగుచున్నది.

## మానవుడు

| బాల్యములో | వృద్ధాప్యములో |
|---|---|
| (a) నడక నేర్వకముందు ప్రాకును. | నడవలేక దేకును. |
| (b) తప్పటడుగులతో నడక నేర్చును. | చేతికర్ర ఊతగాగొని, నడచును |
| (c) దంతములు, పల్లు లేవు. | దంతములు, పల్లు ఊడిపోయినవి. |
| (d) అమాయకపు స్థితి | చాంచల్య స్థితి. |
| (e) తినుబండారములకై మారాము చేయును. | జిహ్వాచాపల్యముచే రుచులను కోరును. |
| (f) సంసార మనగా నేమో ఎరుగడు. | సంసారమందు తాపత్రయము లేదు. |
| (g) బట్ట కట్టడు, దిగంబరి. | అవసాన స్థితిలో, దహనసమయమందు గాని, ఖనన సమయమందు గాని, వస్త్రమును తీసి వైతురు. |

**282.** సృష్టి–అనుటతోడనే, అందు స్థితి–లయములు రెండును సిద్ధముగ నున్నవి. కనుక – భగవంతుడు మాయను సృష్టించుటతో, అప్పుడే అందులో సృష్టియొక్క స్థితి-లయములు ఇమిడి యున్నవి.

కనుక సృష్టింపబడినది పోషింపబడవలెను.
పోషింపబడినది నాశనము కావలెను

**283.** ప్రపంచము ఒక మిథ్య. ప్రపంచ వ్యవహారములు ఆ మిథ్యలో మరియొక మిథ్య.

అనగా—

మిథ్యయైన సృష్టి భగవంతుని దివ్య స్వప్నము. భగవంతుడు మానవుని స్థితిలో, మానవ జీవితమును, దివ్యస్వప్నములో మరియొక స్వప్నముగా, స్వప్న జీవితమును అనుభవించుచున్నాడు.

# కల లో కల లో కల




284. భగవంతుడు మానవుని స్థితిలో, సుషుప్తియందునప్పుడు తన దివ్యసుషుప్తి యొక్క అనాది మూల స్థితిని ఉద్ఘాటించుచున్నాడు.

285. సుషుప్తిలో అదృశ్యమైయున్న పూర్ణ చైతన్యమును అసంఖ్యాక సంస్కారములును జాగ్రదవస్థలో పైకి లేచి, పరమాణు ప్రమాణమై అభావ ఆవిష్కారమైన సృష్టిని, అనంతముగను, వాస్తవముగను అనుభవించుచుండును.

286. సుషుప్తిలో పూర్ణ చైతన్యమును, సంస్కారములును అదృశ్యము లగుచున్నవి.

287. పునర్జన్మ ప్రక్రియయందును, ఆధ్యాత్మికమార్గమందును సంస్కారములు పూర్తిగా రద్దు అగువరకు, చైతన్యము సంస్కారములు కూడా సుషుప్తినుండి - జాగృతికి ఉదయించుచు, జాగృతినుండి - సుషుప్తిలో అదృశ్యమగుచుండును. వ్యతిరేక సంస్కారముల ద్వారా సంస్కారములు పూర్తిగా రద్దగుచుండును.

288. మానవుని సుషుప్తిలో మిథ్యాహం యొక్క చైతన్యము లేదు. కాని అహం మాత్రమున్నది.

289. మానవుడు సుషుప్తి అవస్థనుండి, జాగ్రదవస్థకు వచ్చుటకు తప్పనిసరిగా మధ్యనున్న స్వప్నస్థితిని దాటి రావలయును.

290. మానవుని సుషుప్తియు, భగవంతుని దివ్య సుషుప్తియు ఒక్కటే.

291. భగవంతుడు శాశ్వతముగా, పరాత్పర స్థితిలో దివ్య సుషుప్తియందే ఉన్నాడు. కాని మానవస్థితిలోనున్న భగవంతుడు వైకల్పికముగా ఒకసారి సుషుప్తిని, మరొకసారి జాగృతిని అనుభవించుచున్నాడు.

మానవుని అవస్థాత్రయము.　　భగవంతుని అవస్థాత్రయము.



# క ల లో

కల

కలలో

కల

III
నిత్య జీవితములో
మరియొక కల




II కల

**292.** గాఢనిద్రలో మానవుని దేశ - కాలములు నాశనమై నట్లుగా నున్నవి. అనగా, తాత్కాలికముగా నాశన మైనవి.

**293.** గాఢనిద్రలో దేశ-కాలములు నాశనమైనప్పుడు, అతడు మేల్కొనగానే మరల పగలు, విశ్వమును అతనికి ఎట్లు వచ్చుచున్నవి?

స్పృష్టి - స్థితి - లయములు.

**294.** పరిణామక్రమములో ప్రోగుపడి, గాఢ నిద్రలో నిద్రా ణమైయున్న మానవుని స్వీయ సంస్కారములు, చైత న్యము అతనికి ప్రతి దినము జాగ్రదవస్థలో ఉదయ మును, విశ్వమును సృజించుచున్నవి.

**295.** జాగ్రదవస్థలో మానవుని నిత్యజీవిత స్వీయ సంస్కార ములచే ఉదయ, విశ్వములు పోషింపబడుచున్నవి.

**296.** జాగ్రదవస్థయందున్న సంస్కారములు, నిద్రావస్థలో నున్న అనుభవ సంస్కారములచే పగలు, విశ్వములు నాశనమౌచున్నవి.

**297.** భగవంతుడు,

(1) మానవుని నిద్రాణసంస్కార ములద్వారా తన స్వీయ సృష్టికి ... ... ... ... ... కర్తననియు

(2) జాగ్రదవస్థలో దైనందిన జీవితము ద్వారా తన స్వీయ సృష్టికి............... పోషకుడననియు

(3) నిద్రావస్థలో వ్యతిరేక సంస్కారముల ద్వారా తన స్వీయ సృష్టిని నశింపజేయుటలో...మహేశ్వరుడననియు

అనుభవమును పొందుచున్నాడు.

298. సంస్కారక్రీడ ద్వారా మానవుడు ప్రతిదినము పగలును, విశ్వమును సృష్టించి, పోషించుచున్నాడు. రాత్రి, నిద్రలో నాశనము చేయుచున్నాడు

299. భగవంతుడు మానవరూపములో, మానవుని స్వీయ నిద్రాణ సంస్కార ఖేలనము ద్వారా, సృష్టి-స్థితి-లయ కారుడగు జగత్కర్త (ఈశ్వరుడు) అగుచున్నాడు.

## హృదయములో సృష్టి - స్థితి - లయములు

300. హృదయస్పందనములోను, ఊపిరితిత్తులు పనిచేయుటలోను భగవంతుని ఈ సృష్టి - స్థితి - లయములు తప్పిపోకుండా నిరూపింపబడుచున్నవి. హృదయము యొక్క ప్రతిస్పందనములో - గుండె వికాస మొందుట

(పెరుగుట) విశ్రాంతి గొనుట, ముడుచుకొనుట (సంకోచించుట) మొదలగు సంకోచ, వికాసముల ద్వారా జరుగుచున్న సమయమందే-

శిశువు జన్మించుచున్నది – సృష్టి
శిశువు పోషింపబడుచున్నది – స్థితి
చివరకు గుండె, చరమముగా
సంకోచించుట ద్వారా, విశ్రాంతి
రూపములో, దేహము విడువబడు
చున్నది (మరణము) – లయము.

వ్యతిరేక సంస్కారముల
ఆవశ్యకత :

301. సంస్కారములు రద్దగుటకు, భిన్న అనుభవములు తప్పక అవసరము. ఎందుచేతననగా, భిన్న అనుభవములు మాత్రమే చిక్కగానున్న సంస్కారములను సమూలముగా పెకలించగలవు.

302. జాగ్రదవస్థలో, మానవుడు బాహ్యాకార్య కలాప నిమగ్నుడై యుండుట వంటిది పునర్జన్మ ప్రక్రియ.

303. సంస్కారముల వలననే, సృష్టిలో నిద్రావస్థయు, జాగ్రదవస్థయు, పగటి దైనందినజీవితమును స్థాపింపబడుచున్నవి.

304. సృష్టిలోనున్న మిథ్యా జీవితము, సాధారణ సుషుప్తితోడను, సాధారణ జాగృతితోడను ఏర్పడియున్నది.

305. సృష్టిలో ఒక ప్రాణిపొందు సుషుప్తికిని, మానవుని సుషుప్తికిని భేదమున్నది. అట్లే సామాన్యుని సుషుప్తికిని ఆధ్యాత్మిక మార్గములో నున్నవాని సుషుప్తికిని అట్లే భేదమున్నది.

306. ప్రపంచములోనున్న ప్రత్యగాత్మలు భౌతిక గోళము యొక్క సరిహద్దుల లోపలనే యున్నవి.

307. అన్ని భౌతిక సూర్యులు, అన్ని చంద్రులు, అన్ని ప్రపంచములు, రోదసి (అంతరిక్షము) అంతయూ కలిసి భౌతిక గోళము.

308. ఎంత గొప్ప దార్శనికుడైనను, ఎంత గొప్ప విజ్ఞాన శాస్త్రవేత్త అయినను వీరిద్దరు భౌతిక గోళము లోపలనే యున్నారు.

309. బహు సున్నిత పదార్థములైన ఈథర్, అణువు, కంపనము, వెలుతురు, రోదసి ఇవియన్నియు, సున్నిత ద్రవ్యములైనప్పటికీ, అవి భౌతిక పదార్థములే.

పంచ గోళములు (త్రిభువనములు) — అన్నమయ భువనము

310. (1) భౌతిక గోళము
(2) సూక్ష్మ గోళము
(3) మానసిక గోళము
(4) సంయుక్త గోళము
(5) సత్యగోళము

పరస్పర సంబంధ గోళములు

311. భౌతిక గోళము యొక్క ఉనికి పూర్తిగా సూక్ష్మ గోళముపై ఆధారపడి యున్నను, అనేక తరహాలలో సూక్ష్మ గోళమునకు భిన్నమైనది.

312. భౌతికగోళము సూక్ష్మగోళముయొక్క ఫలితమైనప్పటికీ, సూక్ష్మగోళముపూర్తిగా స్వతంత్రమైనది. ఇది సూక్ష్మ గోళముపై ఆధారపడి యున్నది.

313. భౌతిక గోళము అసంఖ్యాక ప్రపంచములు, సూర్యులు, చంద్రులు, నక్షత్రములు యింతెందుకు చాలమోటైన జడపదార్థమునుండి బహు సున్నితమైన భౌతిక పదార్థము వరకు, వీటన్నింటితో కూడియున్నది.

314. భౌతిక గోళములో కొన్ని ప్రపంచములు లోహములు వృక్షజాతులతో కూడియున్నవి, కొన్నింటిలో అగణిత

మైన జీవరాసులున్నవి. మరికొన్ని మానవులతో కూ
యున్నవి. ఈ భౌతిక గోళములో అతి ప్రధానమైన
మన భూమి, ఇక్కడ కొద్దిగనో గొప్పగనో భౌతి
స్పృహగల జీవులన్నింటిలో, అన్ని భౌతిక ప్రపంచము
లోని అన్ని జీవులకంటె పూర్ణ చైతన్యముగల మా
వుడు శ్రేష్ఠుడు.

315. ఆధ్యాత్మిక విషయములను ఎంత చదివినను ఎంత
చర్చించినను, ఎంత యోచించిననూ మానవుడు
సూక్ష్మగోళములో మేల్కొనునంతవరకు ఆతని చైత
న్యము పూర్తిగా భౌతికమునే ఆవరించి యుండును.

316. మన భూమిమీదనున్న మానవులు, భౌతికగోళము లో
అందరి మానవులకంటె ఆధ్యాత్మికముగా శ్రేష్ఠులు.

317. భౌతికగోళము లో మానవులు నివసించు మూడు ప్రపంచ
ములున్నవి. ఈ మూడింటిలో మన భూమియందున్న
మానవులు ఆధ్యాత్మికముగా శ్రేష్ఠతములు.

318. మనభూమియందున్న మానవుడు సమపాళ్లుగల హృదయ
మస్తిష్కములను కలిగియున్నాడు.
50 పాళ్లు హృదయము + 50 పాళ్లు తెలివి.

319. మిగిలిన రెండు ప్రపంచములలోనున్న మానవులు ఒక ప్రపంచములో నూటికి నూరు పాళ్ళు తెలివి తేటలే. మూడవ ప్రపంచములో 75 పాళ్ళు హృదయమును 25 పాళ్ళు తెలివిని కలిగియున్నారు.

320. మానవుడు 84 లక్షల పునర్జన్మలలో, ఈమూడు ప్రపంచములలో ఏదేని యొక ప్రపంచములో జన్మించుచున్నాడు, కాని చరమముగా భగవదైక్యము యనెడు తన దివ్య భాగదేయమును కృతకృత్యమొనర్చుటకు ఈ భూమిపై పుట్టుచున్నాడు.




మనభూమి

321. దిక్కు, కాలమునకు లోబడియున్న భౌతిక గోళము, అసంఖ్యాక విశ్వములతో సూర్యులతో, గ్రహములతో ప్రపంచములతో కూడిన అనంతాకాశముతో సహా యీ భౌతికగోళము, సూక్ష్మ ప్రపంచముతో పోల్చి చూచినచో, ఒక చిన్న తునక వంటిది.

**322.** భౌతికగోళమును ఆవశ్యకల స్థిత్వమందురు. ఇది సూక్ష్మ గోళమునుండి తన ఉనికిని పొందుచున్నది. ఇది సూక్ష్మ గోళముయొక్క ప్రతిబింబము. ఈ దశలో భగవంతునికి - సృష్టికి గల సంబంధము ప్రభువు - బానిస వంటిది. ఈ దశలోనున్న పరిణామ చైతన్యమును దుష్టాత్మ యందురు. ఈ దుష్టాత్మకు భౌతిక సంబంధమైన దేదియైనను సంతోషించి అనుభవించు స్వాభావికమైన ప్రవృత్తికలదు. ఇక్కడ భగవంతునికి - మానవునకుగల సంబంధ భావమును మౌఖిక ఏకత్వ మందురు. (అనగా మాటలలో మాత్రమే భగవంతునితో తనకుకల ఐక్యతను అంగీకరించుచున్నాడు)

---

Notes:—

భౌతికగోళము

| | |
|---|---|
| అసంఖ్యాకములగు సూర్యులు<br>చంద్రులు<br>నక్షత్రములు<br>గ్రహములు<br>అనంతాకాశము<br>దిక్కు, కాలములు<br>విశ్వములు | } బ్రహ్మాండము |

# మానవరూపము

## సూఫీల భావన.

223. భౌతిక అస్తిత్వమైన పాంచభౌతిక స్థూలకాయము ద్వారానే రాతి నుండి మానవుని వరకు పరిణామము జరిగినది. భగవంతుని అనుగ్రహము వలననే రూపము లేని ఆత్మకు స్థూలరూపము వచ్చినది. ఈ స్థూల రూపము లేనిదే ఆధ్యాత్మిక పరిపూర్ణత్వముగాని, ఋషిత్వముగాని, నాయకత్వముగాని కలుగునని యూహించుట వెర్రితనము.

స్థూల దేహము పరమాద్భుతమైన అద్వితీయ యంత్రనిర్మాణము. దీనిలో మిగిలిన నాల్గుని అస్తిత్వ ములును ఉన్నవి. మానవరూపమును క్షుద్ర జగత్తు నియు, ఇది విశ్వజగత్తుయొక్క సంగ్రహ రూపమనియు సూఫీలు పిలుతురు.

ఒక సద్గురువు లేక అవతారపురుషునియొక్క సార్వ భౌమిక మనస్సుయొక్క సహాయము లేకుండా వీటి మర్మ మెవరికిని తెలియరాదు.

324. స్థూల కాయముతో అపవిత్రుడైన మానవుడు దేవ తలకంటె తక్కువ స్థితి గలవాడు కాని మానవుడు వానిలో అంతర్నిహితమైయున్న శక్యతల వలన నిజ ముగా శ్రేష్ఠుడు.

**325.** మానవుడు తన అపరిపూర్ణతలను, హద్దులను బలహీనతలను అనుభవించుచు తన నిజమైన శక్తిని, పవిత్రతను అనుభూతి నొందుటలో (అంతర్గతముగా) శక్యతగా పరిపక్వమైనవాడు.

ఈ శక్యతయు, పవిత్రతయు ప్రధాన దేవదూతలకు కూడా అందుబాటులో లేనివి.

మౌఖిక ఐక్యము :—

**326.** మానవుని ఆధ్యాత్మిక వికాసములలోనిదియొకటి. అధిక సంఖ్యాకులైన మానవులు ఏదియో ఒక అవతారమును నమ్మి ఆతడు చెప్పు సందేశమందు విశ్వాసము కలిగి యుందురు. ఇక్కడ భగవంతునితో గల ఐక్యత మాటల ద్వారానే అంగీకరించుట జరుగుచున్నది. దానికి తోడు మతగురువు లోసంగు మతధర్మములను పాటించుటతో, అది, రాబోవు ఆధ్యాత్మికమార్గములో ప్రవేశించుటకు మానవుని తయారు చేయుచున్నది.

**327.** సామాన్య మానవుడు, మానవునిగా, తనను ప్రతి వారిలో ప్రతిదానిలో చూచును. ఇతడు భూమికలను గురించి వివరించలేడు.

**328.** లౌకిక జ్ఞానము భౌతికసంక్షేమప్రాప్తికి సంబంధించినది.

**329.** ధర్మశాస్త్ర జ్ఞానము (కర్మకాండ మార్గము) తార్కికమైన వాగ్యుద్ధములతో, శాస్త్ర ప్రామాణికములతో పరులను ఓడించుటకై సంపాదించు జ్ఞానము.

330. పునర్జన్మ ప్రక్రియ, స్థూల సంస్కారముల సరిహద్దునకు తీసికొని పోవును.

భౌతిక ప్రపంచానుభవము.

331. ఆత్మ మానవరూపములో అసంఖ్యాక యుగములు జనన-మరణములు పొందుటద్వారా, భౌతిక లోకానుభవమునకు పరిపక్వస్థితి ప్రాప్తించును. అంతట యీ భౌతిక లోకానుభవము-సంస్కార భారమునుండి చైతన్యము విముక్తి పొందుటకు భౌతిక సంస్కారములు క్రమ క్రమముగా చెరిగిపోయి, పూర్తిగా అదృశ్యమగుటకు ఎంతయో దోహదము చేయును.

332. మానవునిలో నున్న భగవంతుడు, సత్యవత్ తాను ఎటుకలో భగవంతుడు కాగలందులకు గాను, ఇప్పుడు మానవునిపై కేంద్రీకృతమైన భగవంతుని బహిర్ముఖ చైతన్యము, భగవంతునితో తాదాత్మ్యత నొందుటకై క్రమ క్రమముగా, పూర్తిగాఅంతర్ముఖముకావలసినదే.

ఆత్మ విశ్వాసము.

333. సామాన్య మానవులు వారి నిష్కళంకమైన విశ్వాసములో భగవంతుడున్నాడని విశ్వసింతురు.

---

Note :— అంతర్ముఖము= లోలోపలకు చొచ్చుకొని పోవుట.
బహిర్ముఖము= వెలుపలికి చిమ్ముట.

# సూక్ష్మ మానసిక

గోళములు

# జ్ఞాన మార్గము

(అనుభూతి ప్రక్రియ)

సూక్ష్మ శరీరమందు
ఎఱుక కలిగియున్న
మానవుడు



చైతన్య.

| భూమికలు | | అనుభవస్థితి |
|---|---|---|
| 1. మేధ | – | భౌతిక జ్ఞానమును సముపార్జించును. |
| 2. అంతర జ్ఞానము | – | కల్పనాశక్తిపని చేయును. |
| 3. దివ్య ప్రేరణము | – | ఆధ్యాత్మిక ప్రపంచము నవలోకించును. |
| 4. పరిజ్ఞానము | – | వాస్తవిక – సత్యముల యందు విచక్షణాజ్ఞానము కలుగును. |
| | – | |
| 5. మహాదివ్య ప్రేరణము | | సత్య సామ్రాజ్యద్వారమున ప్రవేశించును. |
| 6. ప్రదీప్తి ఆత్మ ప్రకాశనము ఆత్మ సాక్షాత్కారము | | సర్వవస్తువులయందు ఐక్యమును గాంచును. |
| 7. బ్రహ్మానుభూతి | | ఆత్మకు విముక్తిగల్గి స్వేచ్ఛ ననుభవించును. |

—

భగవంతుని
ఏడవపాత్ర

## సాధు పురుషులు
## మహా పురుషులు
## సత్పురుషులు

### ముముక్షువులు

సూక్ష్మ గోళము :-

**334.** సూక్ష్మ మండలము అనంత ప్రాణ సామ్రాజ్యము. భగవంతుని అనంత స్వభావత్రయములో ఒకటైన అనంత శక్తి, పరిమితమైన మిథ్యాజగత్తులోనికి ప్రసరించినప్పుడు, అది సూక్ష్మ లోకములో అనంత ప్రాణశక్తిగా రూపాంతర మొందెను.

**335.** సూక్ష్మగోళము 7 డివిజనులుగా విభజింపబడియున్నను అది యంతయు ఒకటే ప్రపంచము. ఇది ప్రాణశక్తి మయ గోళము. ఈ గోళము మనోమయ గోళముపై ఆధారపడి యున్ననూ, భౌతిక గోళము పట్ల స్వతంత్రమైనది.

**336.** సూక్ష్మగోళము, దాని ప్రాణశక్తి, అందలి దివ్యజీవులు, మానవుని పూర్తి సూక్ష్మ చైతన్యము, పాక్షిక సూక్ష్మ చైతన్యముల ద్వారా భౌతిక గోళమును అల్లుకొనుచున్నప్పుడు, సూర్యులు, నక్షత్రములు, గ్రహములు, అన్ని ప్రపంచములలో నున్న ప్రతి వస్తువు ప్రతిజీవి,

వీటన్నింటితో కూడిన అనంత ఆకాశమును కూడా అల్లుకొనుచున్నది. అనంతాకాశము కూడా భౌతిక గోళము లోపల నున్నదే.

337. అపరిమితమైన నానాత్వమును సూక్ష్మదృశ్యములు, సూక్ష్మధ్వనులు, సూక్ష్మానుభూతులు శక్తులయొక్క తీవ్రతయును భౌతికగోళములో సమాంతరమును కలిగి యుండక ప్రాణశక్తిని కాపాడు చున్నవి. ఈ ప్రాణశక్తి భౌతిక హద్దులలోపల పరిమితమగుచున్నది. మానవుని చైతన్యము భౌతికపరిమితులచే చుట్టబడియున్నది.

338. సంభవ అస్తిత్వము :- సూక్ష్మగోళము పంచ ఆవిష్కారములలో నొకటి. ఇది దేవతలు, పితరులుతో కూడియుండును. ప్రాణమయభువనము, నాల్గవ ఆవిష్కారము.

సూక్ష్మగోళము మనోమయ గోళము నుండి తన ఉనికిని పొందుచున్నది. ఇచ్చట భగవంతునికి ఆతని ఆవిష్కార విశేషములకు గల సంబంధము - తండ్రికి ఆతని సంతానము నకు గల సంబంధము వంటిది. ఇచ్చట భగవంతుడు దయాళువు, కరుణామయుడు. తన

Notes:—సూక్ష్మగోళము 1, 2, 3, 4 భూమికలకు సంబంధించినది. ఆధ్యాత్మికముగా సూక్ష్మమనగా - కేవలము భౌతికమునకు అన్యమైనది.

సంతానముపట్ల ఏమరుపక యుందును. వీరుశిక్ష-బహూకృతులందు ఆలోచన, జ్ఞానాసక్తి, ఆధ్యాత్మిక సిద్ధి కొఱకు ప్రయాస లేనట్టి ఉపేక్షాపరులు, వీరే దేవతలు.

ఇచ్చట భగవంతునితో గల సంబంధము సక్రియాత్మక ఐక్యము (అనగా భగవంతుని సంకల్పము లేనిదే వీరు ఏపని చేయరు. భగవత్సంకల్ప స్వరూపులే దేవతలు) వీరు భగవంతునిస్తుతించుట ద్వారా స్మృతికి తెచ్చుకొను కార్యములో ఏకాంతవాసులై తీరిక లేక యుందురు.

**339.** దేవతలు :- వీరు అమరులు, భగవంతుని సంకల్పమునకు స్వయంకమన మూర్తులు భగవంతుడు వాంఛించనిదే, ప్రోత్సహించనిదే వీరు ఏమియును చేయరు. అనగా వీరు భగవంతుని సంకల్ప స్వరూపులు.

**340.** దేవతలు, స్థూలకాయముతో అపవిత్రులు కాని పవిత్ర జీవులు. ఈ సందర్భములో దేవతలు సామాన్య మానవులకంటె శ్రేష్ఠులు.

**341.** దేవతలు మానవుడు పొందగల సత్యస్థితిని చేరుకొనుటకు ముందుగా దేవత్వమును వీడి మానవులు కావలసినదే. అట్లే మానవుడు మానవత్వమును "వీడి-నేను భగవంతుడను" అనెడి స్థితిలో ప్రవేశించవలసినదే.

**342.** అసంఖ్యాక జనన – మరణముల అనంతరము, భౌతిక చైతన్యము గల మానవాత్మ చిట్టచివరకు తప్పనిసరిగా భగవంతుని యొద్దకు తీసుకొనిపోవు జ్ఞానమార్గము వంకకు మరలును.

**343.** ఆత్మయొక్క చైతన్యము, భౌతిక ప్రపంచము నుండి విడిపోవుటకు గల పరిపక్వత రాగానే, స్వస్థానమునకు మరలుటకై ఆధ్యాత్మిక మార్గములో ప్రవేశించును.

**344.** ఆధ్యాత్మిక మార్గము ఆరుభూమికలతో కూడియున్నది

**345.** అగాధమైన సత్యమునకై స్పృహాకిల్గి తహతహ చెందుటయే ఆధ్యాత్మికము.

**346.** పునర్జన్మ ప్రక్రియలో అసంఖ్యాకజన్మములనంతరము, ఆ జన్మల ద్వారా భిన్నసంస్కారములు క్రమక్రమముగా వదులై (బిగువు సడలి) నప్పుడే అంతర్ముఖ క్రమము (జ్ఞానమార్గము) సాధ్యమగును.

**347.** ఆత్మయొక్క చైతన్యము. ఇంక ఇంద్రియాత్మక మగు భౌతిక ప్రపంచమునుండి విముఖతజెంది అంతర్ముఖమై సూక్ష్మ – మానసిక గోళముల ద్వారా ఆధ్యాత్మిక అభివృద్ధిని కోరుచున్నది.

**348.** చైతన్యము సప్తవివిధ దశలలో విస్తరిల్లి పూర్ణచైతన్యమాయెను. అట్లే ఆ విస్తరిల్లిన పూర్ణచైతన్యము సప్తవివిధ స్థితులలో అంతర్ముఖమాయెను.

349. ఇంద్రియ సంబంధమైన జీవితమును, ఆత్మ సంబంధ జీవితమునకు మరల్చుటయే వైరాగ్యము.

350. సంస్కార భారమునుండి విముక్తి పొందుటకు సర్వ విధముల పడెడు యాతనలో, చైతన్యము అంతర్ముఖ మగుటకు ఇదియే ప్రథమ సోపానము.

351. బాహ్యకార్య కలాపమందు నిమగ్నుడై పనులు ముగిసిన తరువాత ఆపనులనుండి, తనవైపునకు ధ్యానమును మరలించుట వంటిది అంతర్ముఖ క్రమము.

352. తాను చూచిన మనుష్యుడు, తాను చూచుచుండగనే తనయొద్దనుండి దూరముగా పోవు టవంటిది అంతర్ముఖ క్రమము.

353. మార్గములో ప్రవేశించు కొలదీ, చైతన్యము అంత హెచ్చుగా లోపలికి చొచ్చుకొని పోవుచుండును.

354. చైతన్యము అంతర్ముఖ మగుటకు ప్రారంభించుటతో మానవుని స్థితిలోనున్న భగవంతుడు, క్రమ క్రమముగా భౌతిక ప్రపంచము యొక్క ద్వంద్వ సంస్కార అనుభవమునకు దూరమగును.

355. ఘన రూపములోనున్న భౌతిక సంస్కారములు క్రమ క్రమముగా ద్రవరూపములో పలుచనై, అవి క్రమ క్రమముగా ఆవిరిరూపములో మరింతగా అదృశ్యమగుట, అంతర్ముఖ ప్రక్రియలో జరుగు క్రమపద్ధతి.

356. కాని కొన్ని సందర్భములలో, మిక్కిలి అరుదుగా భౌతిక సంస్కారములు హఠాత్తుగా అదృశ్యమై వాటి నుండి విముక్తి నొందిన చైతన్యము, పరమాత్మలో ఏకత్వమొంది, పరమాత్మానుభూతిని పొందును. ఇట్టిది చాల అరుదుగా జరిగెడి సంఘటనము.

357. సంస్కారములు తరిగిన కొలది, చైతన్యము వాటి నుండి విముక్తిని పొందును.

358. భౌతిక సంస్కారములు, సూక్ష్మ సంస్కారములుగను; సూక్ష్మసంస్కారములు మానసిక సంస్కారములుగను మారి, చివరకు మానసికసంస్కారములు కూడా అదృశ్య మగును. ఇది మామూలుగ జరుగు క్రమ విధానము.

359. ఒకటవ భూమిక – సగము భౌతిక ప్రపంచము
సగము సూక్ష్మ ప్రపంచము
రెండు, మూడు భూమికలు – పూర్తిగా సూక్ష్మ ప్రపంచము.
నాల్గవ భూమిక – సగము సూక్ష్మ ప్రపంచము
సగము మనోమయ ప్రపంచమునకు
చెంది యుండును.

360. ఆత్మ, సూక్ష్మశరీరము ద్వారా, సూక్ష్మగోళము యొక్క ఎఱుకను పొందుచున్నప్పుడు సూక్ష్మ శరీరము (ప్రాణము) తో తాదాత్మ్యతను చెందుచున్నది.

**361.** ఆత్మ, సూక్ష్మసంస్కారమును కలిగియుండి, వాటి కను గుణ్యముగా **సూక్ష్మ**శరీరముయొక్క చైతన్యమునే కలిగి, సూక్ష్మ ప్రపంచానుభవమును పొందుచుండును.

సూక్ష్మ లోకానుభవములు :—

వినుట,

ఆఘ్రాణించుట,

చూచుట.

**362.** ఆత్మ, సూక్ష్మసంస్కారమును కలిగియుండి, **సూక్ష్మ** శరీరముతో తాదాత్మ్యతచెంది, ఆ **సూక్ష్మ** శరీర**మే** తానని భావించును. ("నేను శక్తిని")

**363.** ఆత్మయొక్క చైతన్యము, సూక్ష్మసంస్కారములందు చిక్కువడి సూక్ష్మశరీరముద్వారా సూక్ష్మసంస్కారానుభవమును పొందుచున్నది.

సక్రియాత్మక ఐక్యము :—

**364.** ఆధ్యాత్మిక మార్గములో ప్రవేశించిన బ్రహ్మసక్తులైన సాధకులకు సంబంధించినది సక్రియాత్మక ఐక్యము ఇచ్చట భగవంతునితో గల ఐక్యమును దివ్యులైన దేవతల ద్వారా వ్యక్తమగుచుండును. ఇచ్చట అంతరంగమున కలుగు ఆధ్యాత్మికవిశ్వాసము మంచి, చెడుగు లన్నింటికి వెనుక నున్నది. ఇదే భగవంతుని సంచలితశక్తి.

**365.** ఆధ్యాత్మిక మార్గములో సూక్ష్మభూమికలలో ప్రయాణించు సాధకుడు, అక్కడక్కడ యుండు ఆకర్షణలకు దృశ్యములకు సమ్మోహితుడై పరవశుడై తన పారవశ్యతయే గమ్యస్థానమని భావించును. అట్టి స్థితిలో నున్నవారిని, సద్గురువులు గాని, ఉన్నత భూమికలలో నున్నవారుగాని వచ్చి, పై స్థాయికి చేయూత నిచ్చుటలో సహాయ పడెదరు.

ఆధ్యాత్మిక జ్ఞానము:— (తరీకత్)

**366.** అంతర క్రమశిక్షితులైన సంఘవర్జితులకు సంబంధించిన జ్ఞానము. ఈ జ్ఞానములో ఇంకను అహమున్నది. మంచి – చెడుగుల యొక్క చైతన్యము ఆత్మలో లగ్నమై యుండును. వేదాంతుల జ్ఞానమును, చింతకుల జ్ఞానమును ధర్మశాస్త్రజ్ఞానము, ఆధ్యాత్మిక జ్ఞానముల సరిహద్దులో నుండును.

**367.** మార్గములో నున్నవారు భూమికలను గురించి వివరింతురు. కాని తమకు ఆవలనున్న భూమికల గురించి చెప్పలేరు.

**368.** ప్రపంచము నుండి నిస్సంగమును పొందినవాడు సాధకుడగును.

మొదటి భూమిక :—

**369.** ఇచ్చట స్థూల ఇంద్రియములు సూక్ష్మఇంద్రియములు ఏకకాలమందే పని చేయును.

370. భౌతిక చైతన్యముగల ఆత్మ, సూక్ష్మలోక మందలి మొదటి భూమికలో సాక్షికముగా స్థూల ఇంద్రియములతో సూక్ష్మసంస్కారములను అనుభవించును.

విసుట :— వెలుపలి చెవులతో సూక్ష్మ భూమిక యందలి గంధర్వగానమును వినును.

చూచుట :— వెలుపలి నేత్రములతో అదే భూమిక యందలి లీలలను చూచును.

ఆఘ్రాణించుట:— వెలుపలి ముక్కుతో, అదే భూమిక యందలి పరిమళమును వాసన చూచును.

371. అమర గానము భూమికలన్నింటిలో వేర్వేరుగా వినిపించును.

372. ఉన్నతతర భూమికల అనుభవములో స్థూల ఇంద్రియముల యొక్క వినుట, చూచుట, ఆఘ్రాణించుట నిరుపయోగము. అచ్చట వినుచున్నది వేరే చెవి, చూచుచున్నది వేరే కన్ను, ఆఘ్రాణించునది వేరే ముక్కు, వెలుపలి ఇంద్రియములైన కన్ను-ముక్కు-చెవులకు ప్రతిరూపములుగా అంతర నేత్రము, అంతర నాసికము, అంతర కర్ణము ఉన్నవి.

373. లోపలి ఇంద్రియములతో ఉన్నతతర భూమికల అనుభవమును పొందును.

374. మొదటి మూడు భూమికలలో గాంధర్వ గానము విని పించును. గానస్వరూపము, గానమాధుర్యము గానా నందము వర్ణించ నలవి కానివి.

375. మానవుడు సూక్ష్మ భూమికలో నున్నప్పుడు ఈ ప్రాణ శక్తియే, ఈశ్వరీయముగను జ్ఞానయుక్తముగను ఉప యోగింప బడును.

కానీ, సూక్ష్మ భూమికలో నున్నప్పుడు మనస్సు పరోక్షముగను తెలియకుండగను ఉపయోగింప బడు చుండును.

376. మొదటి భూమిక భౌతిక - సూక్ష్మ ప్రపంచములను విడదీయు సరిహద్దు రేఖ వంటిది. మానవుని స్థితిలో భౌతిక చైతన్యముగల భగవంతుడు (కండ్లు, చెవులు, ముక్కులు) స్థూలేంద్రియములతో సూక్ష్మ సంస్కార అనుభవమును పొందును.

రెండవ భూమిక :—

377. సూక్ష్మ ప్రపంచ మందలి రెండవ భూమికయందు మానవ స్థితిలో నున్న భగవంతుడు పూర్తిగా సూక్ష్మ శరీర చైతన్యము కలవాడై యుండును.

378. దేవలోకమునుండి ఘనమైన శుభవార్తలు వచ్చు చుండును.

379. సూక్ష్మ ప్రపంచముయొక్క అనంతప్రాణశక్తి యొక్క చైతన్యమందు, మొదటి భూమికలోకన్న అధికమగు ఎఱుకతో నుండును స్థూల దేహముయొక్క గాని మనస్సుయొక్క గాని చైతన్యము పూర్తిగా లేనివాడై యున్నందున భౌతిక - మానసిక లోకానుభవములు లేనివాడగును.

కనుక సూక్ష్మభూమిక నుండి మన శరీరముల రెండింటిని ప్రత్యక్షముగా ఉపయోగించడు. అవి రెండునూ పరోక్షముగా వినియోగపడుచుండును.

380. ఈ మానవస్థితి యందున్న భగవంతుడు స్థూల దేహ చైతన్యముగల సామాన్యునివలెనే బాహ్యమునకు కాన్పించును. సామాన్యునివలెనే తినును, త్రాగును, నిద్రించును, చూచును, అనుభూతి పొందును, వినును ఆలోచనలు, వాంఛలు, చిత్తవికారములు కలిగి యుండును.

సూక్ష్మ శరీరముయొక్క సూక్ష్మేంద్రియ జ్ఞానము లైన చూచుట, ఆఘ్రాణించుట, వినుటయనెడు సరిక్రొత్త సూక్ష్మ సంస్కారములనుసృష్టించును.

చిన్న చిన్న శక్తులను ప్రదర్శించుశక్తిగల వాడగును.

ఉదా :- ప్రోడును చిగురింప జేయగల్గును. పచ్చని చెట్టును ప్రోడుచేయును. రైళ్ళను, మోటారుకార్లను నిలుపగల్గును. ఎండి పోయిన నూతిలో జలము నింపును.

మూడవ భూమిక :—

381. దివ్యప్రియతముని గురించి అమరగానముచేయు గాయకుల దివ్యగానము వినిపించును.

382. దివ్యనాదము అన్ని భూమికలలో వినిపించుచున్నను, ప్రత్యేకించి రెండు, మూడు భూమికలు దివ్యపరిమళములను గుబాళించును.

383. సూక్ష్మ చైతన్యముగల మానవాత్మ ఇచ్చట సూక్ష్మలోకముయొక్క అనంత ప్రాణశక్తియందు మరెంత స్పృహకలిగి యుండును.

గొప్ప శక్తులను ప్రదర్శించును. అంధులకు దృష్టి నిచ్చును. వికలాంగులకు అవయవములు నొసంగును. కొన్ని సమయములందు చనిపోయిన వారిని బ్రతికించును.

స్థూలదేహ చైతన్యముగల సామాన్యుడు తన స్థూల దేహముతో ఖండాంతరములకు ప్రయాణము చేయగల్గినట్లు, ఇతడు సూక్ష్మ ప్రపంచము యొక్క, వేర్వేరు భూమికలయొక్క వేర్వేరు లోకములయొక్క అనుభవమును కలిగియుండును.

## మూడు - నాలుగు భూమికలమధ్య:—

481. ఆధ్యాత్మిక యానములో మూడు నాల్గు భూమికల మధ్యనున్న స్థితి చాల ప్రమాదకరమైనది. అది సాధకులను మంత్రముగ్ధులను గావించు ఆకర్షణలతో నిండి యుండును. దీనిని ముకామ్ - ఏ - హైరత్ అందురు.

చాలమంది యీ ప్రమాద పరిస్థితినుండి దాటి ముందుకు నాల్గవ భూమికకు పోవుదురు.

సాధకుడు ఇచ్చట ఒకసారి ఆగినచో, ఆతడు ఆస్థితి నుండి బయటపడుట దుస్సాధ్యము. ఇతడు యీ స్థితి నుండి తప్పించుకొని బయటపడి ముందుకు సాగిపోని యెడల ఆతని ప్రగతి అంతటితో నిలిచిపోవును. కొన్ని సమయములందు, రోజులు తరబడి లేక, నెలల తరబడి లేక, సంవత్సరముల తరబడికూడా ఆతడు అట్లే నిలిచి పోగలడు.

ఈస్థితియందు చిక్కుకొన్న సాధకుడు ముందుకు పోలేడు, వెనుకకు రాలేడు. అతడు భౌతికమందుగాని సూక్ష్మమందుగాని ఎఱుక లేకుండును.

ఆతడు స్పృహలేని వాడని చెప్పుటకు వీలులేదు. ఎందుచేత ననగా, ఆతడు చిక్కుకొనియున్న ఆసమ్మోహిత స్థితియందు స్పృహకలవాడై యున్నాడు కాని, జీవన్మృతునిగా నున్నాడు.

సాధకుడు ఈ స్థితియందు చిక్కుకొన్న ప్రారంభములో, ఆతడు శారీరకముగా ఏస్థితియందుండునో-అనగా ఏ భంగిమలోనుండునో అదే భంగిమములో ప్రతిమవలె అట్లే ఉండిపోవును. ఆవిధముగా కాన్పించినను వాస్తవముగా సామాన్యునికంటె ఉత్సాహవంతుడై యుండును.

ఈ స్థితి యందున్నవాడు బయటపడవలె నన్నచో, ఆతనికి మరణమైననూ సంభవించవలెను. లేదా, ఏ సద్గురువుయొక్క సహాయమైనను కావలెను. అప్పటి వరకు ఆతడట్లే యుండును.

ఈతనిని సద్గురువు వెనుకకు మూడవ భూమికకు తీసికొని పోవును లేదా ముందుకు నాల్గవ భూమికకు త్రోసివేయును.

చాల అరుదుగా, ఈస్థితియందున్న సాధకుడు భగవదనుగ్రహము వలన, ప్రమాద రూపములో 5 వ భూమికకు 6 వ భూమికకు మధ్య ఇదేమాదిరి వశీకరణ స్థితిలోనికి ముందుకు లాగబడును.

నాల్గవ భూమిక :—

385. నాల్గవ భూమిక సగము సూక్ష్మలోకమునకు సగము మానసిక లోకమునకు చెందియుండును. మానసిక లోకమునకిది గడప వంటిది. సూక్ష్మగోళము యొక్క

అనంత ప్రాణశక్తియందు సంపూర్ణమైన ఎటువంటి కలిమి పూర్ణశక్తిస్వరూపుడై యుండును. ఇది భగవంతుని అనంతశక్తియొక్క పరిమిత లక్షణము.

386. ఇతడు మరణించిన వారిని బ్రతికించును. సృష్టికి ప్రతి సృష్టి చేయును. అసలు తనశక్తులను ప్రదర్శించకున్నను లేక, శక్తులను దుర్వినియోగ పరచకున్నను అయిదవ భూమికను చేరగల్గును. కొన్ని సమయములందు, సద్వినియోగ పరచినచో సద్గురువుల సహాయముతో ఆరవ భూమికకు చేర్చబడును. ఈ సహాయము జీవన్ముక్తుల వలన గాని బ్రహ్మీభూతులవలన గాని కాదు.

387. ఆధ్యాత్మికముగాపరిపూర్ణులుకానియోగులుమహిమలను ప్రదర్శించుటలో, అసలు వస్తువులను ఉన్నవి ఉన్నట్లు గాక, తద్భిన్నముగ మనకు కనిపించునట్లు చేయుదురు. అనగా, అసలు సృష్టియే మిథ్య. అట్టి మిథ్యలో మరి యొక మిథ్యను ప్రవేశపెట్టెదరు.

388. దిగువ భూమికలలో నున్న ఆధ్యాత్మిక బాటసారులు మిక్కిలి అరుదుగా శక్తులను పరియాచించి, వాటితో మహిమలను ప్రదర్శింతురు.

389. ఇతడు విపరీతమగు వాంఛలకు పరాధీనుడై సంకల్ప మాత్రంచే తన అనంత ప్రాణశక్తిని ఉపయోగించవలె నని ఉబలాటపడుచుండును

390. వాస్తవమునకు, ఒకసారి చైతన్యమును పొందిన యెడల అదెన్నటికిని తరిగిపోదు.

391. కాని నాల్గవ భూమికలో శక్తులు దుర్వినియోగ మైనప్పుడు మాత్రము చైతన్యము అది యెచ్చట ప్రారంభమైనదో ఆ స్థితికి క్రిందికి పడిపోవును.

392. నాల్గవ భూమిక యందున్న సూక్ష్మ చైతన్యము గల ఆత్మ, తన అధీనమందున్న అద్భుత గుప్తశక్తులను దుర్వినియోగము చేయకుండా కాపాడుట, సద్గురువు చేయు కార్యములలో నొక కార్యము.

393 సృష్టిలో చిన్నదిగాని గొప్పదిగాని ఏమి జరిగినను అది భగవత్సంకల్పము ప్రకారమే జరుగును.

394 ఈ భూమిక యందలి అనంత ప్రాణము, భౌతిక ప్రపంచమందలి అణుశక్తివంటిది మాత్రముకాదు. సమస్త జీవనాధారమగు శ్వాస సంబంధమైన ప్రాణము.

ఈ అనంత ప్రాణశక్తి సమస్త వస్తువులు సజీవము లగుటకు కారణభూతమగును. ఈ భూమికయందు మానవస్థితిలోనున్న భగవంతుడు ధూళినుండి సజీవ వస్తువులను సృజించగలడు.

ఈ ప్రాణశక్తి ఎంత అనంతమై యున్నప్పటికీ, భగవంతుని అనంతశక్తితో సరికాదు. భగవంతుని అనంతశక్తి ప్రకృతిలో అనంత ప్రాణశక్తిగా రూపాంతర మందిన అనంతశక్తియొక్క పరిమిత లక్షణము.

395. సూక్ష్మలోక మందలి నాల్గవ భూమిక యొక్క చైతన్యము కలిగిన మానవ స్థితిలోనున్న భగవంతుడు అనంత ప్రాణశక్తి భాండారమునకు అధిపతి. మనోమయ ప్రపంచము యొక్క మానసికలక్షణములైన తీవ్ర వాంఛలను, తీవ్ర వికారములను, తీవ్ర భావములను తీర్చుకొనుటకు ఉద్యుక్తుడై యుండును. తీవ్రవాంఛల చే దహింపబడుచుండును. తన అధీనమందున్న అనంత ప్రాణశక్తిని ప్రయోగించుటకు కుతూహాలుడై యుండును. ఉత్కృష్ట స్థాయిలో మానసికతలము నుండి వాంఛలుదయించుచుండును.

396. అణుశక్తి సూక్ష్మ ప్రపంచమందలి అనంత ప్రాణము యొక్క భౌతిక లక్షణములలో ఒక లక్షణము.

397. స్థూల - సూక్ష్మ - కారణదేహములు
మిథ్యాజగత్తులో
తమ శక్తులను
ఎట్లు అనంతముగా
నిరూపించుచున్నవి ?

A భౌతికవిజ్ఞాన శాస్త్రజ్ఞునియొక్క కల్పిత మనస్సు మరుగుపడిన విషయములను నూతన విషయములను కనుగొనుటలో అంత్యమెరుగకున్నది.

B సృష్టియందే పుట్టిన, అణుశక్తి పరిణామమంది, పరాకాష్ఠ స్థితి చేంది దాని భయంకర శక్తిచేత తన సృష్టి నాశనము చేయుటకు సిద్ధపడుచున్నది.

C సృష్టిలో కేవలము సౌఖ్యమునే అన్వేషించు స్థూల దేహము, అంతకంతకు అధిక సౌఖ్యమును కోరుచు మిథ్యా జీవితమునకు ఆకరమైన సౌఖ్యమగుచున్నది.

398. ఇట్టి నిరూపణమునకు కారణ మేమి ?

భగవంతుని మూలమగు అనంత స్వభావత్రయమై అనంత జ్ఞాన-శక్తి-ఆనందములనుండి పుట్టి, మాయలో అనంతముగా వ్యాపించిన కారణముచేత, అవి తమ తమశక్తులను అంత అద్భుతముగా నిరూపించుచున్నవి.

399: 1, 2, 3, 4 భూమికల యందున్న సాధకులు చేయు చమత్కారములు.

ఒకటి, రెండు, మూడు భూమికల యందుండువారు తమతమ భూమికలనుండి చమత్కారములను చేయుదురు.

ఉదా :- ఇతరుల మనోగతాభిప్రాయములను చెప్పుదురు. ఎక్కడబడితే అక్కడ వస్తువులను సృజింతురు. చూడకుండగనే, గ్రంథములందలి విషయములను చదివెదరు. రైళ్ళను నిల్పి వేయుదురు. గంటలతరబడి భూసాపితులై బ్రతికి యుందురు.

400. ఈ చమత్కారములు (సిద్ధులు లేక శక్తులు) నిజముగా వారు తమ తమ భూమికలనుండి సంపాదించినవే. సద్గురువులు, వీరిని మహిమలు చేయకుండునట్లు చేయుదురు. ఒకవేళ ప్రదర్శించినచో అవి ఫలితమునకు రాకుండ చేయుదురు.

401. అద్భుత శక్తులు, బౌద్ధిక వ్యాఖ్యానములకు అందనివి, దానికి అతీతమైనవి. జీవితము ఎంత అగాధమైనదో అద్భుత శక్తులుకూడా అంతగుప్తమైనవి.

402. ఆధ్యాత్మిక మార్గములో అద్భుతశక్తులు వెయ్యోవంతు.



# మానసిక గోళము

మానసిక శరీరమందు
ఎఱుక కలిగియున్న
మానవుడు.



మనోభువనము.

403. ఇది కేవలము భౌతిక, సూక్ష్మగోళములపై స్వతంత్ర మైనది. దివ్యత్వము వలన స్వతంత్రముగా పోషింప బడు చున్నది.

404. వ్యక్తిగత మనస్సునకు, సామూహిక మనస్సునకు సార్వ భౌమిక (విశ్వ) మనస్సునకు మానసిక గోళము నిలయము.

405. మానసికగోళము భౌతిక, సూక్ష్మగోళములను మొదటినుండియు అభివ్యాప్తమై యున్నది.

406. మానసిక గోళము, బుద్ధికి, ప్రజ్ఞకు, అంతర్దర్శనమునకు, ఆత్మ ప్రకాశమునకు సంబంధించినది.

407. మానసికగోళము ఎన్నడును సత్యగోళమును స్పృశించ లేదు. సత్యగోళము స్వయంరక్షకము స్వయంపోషక మైనది. శాశ్వతత్వములో "అహమ్‌బ్రహ్మాస్మి" యనెడు భగవంతుని స్థితియందు ఎఱుక కల్గియున్నది.

408. మానసికగోళ మందున్న బాటసారి ఒకడు భారతదేశ ములో నున్నాడనుకొందము. ఆతడు అమెరికాను చూచు చున్నానని భావించినచో, శారీరకముగాగాని మానసికముగా గాని ఆతడు అమెరికాలో నుండగలడు. ఎందుచేత ననగా – ఆతడు మానసిక ప్రపంచమందుం డుటచేత, మనస్సుయొక్క మూర్తిమత్వము. ఆతడు

ఎక్కడ నుండగోరిన, అక్కడ నుండగలడు. స్థూల, సూక్ష్మ అవయవములను ఉపయోగింపనవసరములేదు. భౌతిక, సూక్ష్మ, మానసికగోళములను గురించి ఆతడు తెలిసికొనగలడు.

ఇతడు తనకంటె తక్కువస్థితి గలవారిని గాని లేక, సామాన్య మానవులనుగాని తన స్థాయికి తీసికొని పోగలడు.

ఐదవ భూమిక :—

409. ఈ భూమిక మానసికగోళ మండలి మొదటిభాగము. ఇతడిచ్చట భావస్రష్టయు, భావాధికారియునై యుండును. భౌతిక, సూక్ష్మ చైతన్యములు గల అందరి ఆత్మలయొక్క జిజ్ఞాస మనస్సులకు అధికారము గల సమర్థుడగును. ఈ భూమిక యందున్న మానవుడు, జిజ్ఞాస మనస్సు లేక, అన్వేషిత మనస్సు లేక, విచారణా మనస్సుతో తాదాత్మ్యుడై యుండును.

ఇచ్చట మనస్సు రెండు విభాగములుగా పని చేయును. మహిమలు ప్రదర్శింపడు. భగవంతుని ముఖాముఖీగా చూడలేడు. ఎఱుకతోగాని, ఎఱుక లేక గాని వెనుకబడిన వారికి గొప్ప సహాయము చేయును.

విచారణ మానసము {
- ఉన్నత భావములు × నీచ భావములు
- సదాలోచనలు × దురాలోచనలు
- ఆధ్యాత్మిక భావములు × ఆధిభౌతిక భావములు

**410.** సంకల్ప స్వరూపుడు :— మానవుని స్థితిలోనున్న మానసిక చైతన్యముగల భగవంతుడు తన మనస్సునకు ప్రభువు.

భౌతిక, సూక్ష్మ లోకములలో భౌతిక సూక్ష్మ చైతన్యములను కలిగి యున్నప్పుడు తన మనస్సునకు బానిసయై యుండెను.

ఇచ్చట కేవలము "చూచుట" (దర్శనము) అనెడి మానసిక జ్ఞానముచే, ఈ భూమికయొక్క అనుభవములు చవి చూడబడును.

ఇతనికి భౌతిక, సూక్ష్మ దేహములస్పృహయుండదు. కాబట్టి తత్సంబంధ లోకానుభవములను చవిచూడలేడు. కాని తన స్థూల, సూక్ష్మ దేహములను స్పృహలేకయే మానసిక తలమునుండి పరోక్షముగా వినియోగించును.

తన స్థూలకాయమందు స్పృహ లేకున్నను, అనేక భౌతిక లక్షణముల ద్వారా దానిని వినియోగించుచు సామాన్య మానవుని వలెనే వ్యవహరించును.

అట్లే అనంతప్రాణము యొక్క వివిధ లక్షణముల ద్వారా, స్పృహలేకుండగనే సూక్ష్మ శరీరమును వినియోగింతురు, ఆ విధముగా అతి చమత్కారముతో కార్యములందు పాల్గొను చుందురు.

స్థూల, సూక్ష్మ శరీరములు స్పృహ లేకపోయినను, అవి రెండును స్పృహలేకయే ఉపయోగపడుచుండును.

ఇతడు పూర్తిగా మనస్సు నుందే స్పృహకల వాడై దర్శనేంద్రియ జ్ఞానము చే మానసిక ప్రపంచాను భవములను పొందుచుండును.

ఇతడు మానసిక ప్రపంచ మందుండుటచేత, ఏవిధమైన శక్తులను ప్రయోగించ లేడు.

సూక్ష్మ భూమికలందు ఎఱుక గలవారి మనస్సులను తనిఖీ చేయును. వాటిని తన అధికారమందుంచును లేక, వాటికి మార్గదర్శి యగును.

తాను మహిమలను ప్రదర్శించ లేకున్నను తన మనో సంకల్పము ప్రకారము, తన వాంఛల ప్రకారము సూక్ష్మ భూమికల చైతన్యము కలవారిచే మహిమలను చేయించగల సమర్థుడగును.

భౌతిక, సూక్ష్మ దేహములయందు చైతన్యముగల వారి అందరి మనస్సులయొక్క తలంపులను, వాంఛలను, చిత్త వికారములను సృష్టించును. వాటిని తన అధికారములో నుంచును.

**411.** సూక్ష్మ, మానసిక, గోళములద్వారా పొందుచున్న ఆధ్యాత్మిక ప్రగతి, కేవలము ఊహ మాత్రమే.

412. ఆత్మ, మనస్సుద్వారా, మనోమయ గోళమందు ఎఱుకను పొందుచున్నప్పుడు మానసిక శరీరముతో తాదాత్మ్యతను చెందుచున్నది.

413. నాల్గవ భూమికను దాటి అయిదవ భూమికలో ప్రవేశించుట యనగా—స్వర్గద్వారమును చేరుటయనిఅర్థము.

414. ఆత్మ, మానసిక సంస్కారములను కలిగియుండి, మనస్సుయొక్క చైతన్యమునే కలిగి, మానసిక లోకానుభవమును పొందుచుండును.

మానసిక లోకానుభవము :—

415. (అంతరదృష్టి, దివ్యదృష్టి) కేవలము చూచుటే. భగవద్దర్శనము.

416. ఆత్మ, మానసిక, సంస్కారములను, కలిగియుండి, మానసిక శరీరముతో తాదాత్మ్యత చెంది, మనస్సే తానని భావించును.

417. ఆత్మయొక్క చైతన్యము, మానసిక సంస్కారముల యందు చిక్కువడి మానసిక శరీరము ద్వారా ఆ సంస్కారముల అనుభవమును పొంది తీరును.

418. మనస్సుయొక్క భౌతిక లక్షణములు :—

వాంఛలు

మానసికోద్వేగములు

తలంపులు

419. మనస్సుయొక్క ప్రబల లక్షణము :- వాంఛలు

420. మనోమయ ప్రపంచమందలి మానసిక చైతన్యముగల ఆత్మలు, సూక్ష్మ ప్రపంచము యొక్క అద్భుత శక్తులందు ఎఱుక లేకుందురు. ఆకారణము చేత శక్తులను ప్రదర్శించలేరు.

421. ఆధ్యాత్మిక మార్గములో అయిదవ భూమిక వరకు బుద్ధి కౌశలము చేతను, అంతర జ్ఞానముల యదార్థత వల్లను, భగవంతుడున్నాడని తెలిసికొందురు. వీరి ఆత్మ విశ్వాసము సరియైన జ్ఞానముపై ఆధారపడి యున్నది.

మానవుని ఆధ్యాత్మిక వికాసము :—

422. అనుభూతి ఐక్యము :— మనోమయ భూమికలైన 5 వ భూమిక యందున్న వారిపై ఉదయించును. ఇచ్చట ఆత్మ, సరాసరి భగవంతుని దివ్యత్వ ప్రసారముచే ప్రకాశింపబడుచున్నానని కనుగొనును. ఎఱుకతో గాని ఎఱుక లేకగాని భౌతిక, సూక్ష్మగోళములలో నున్నవారికి ఇతోధికమైన సహాయమును చేయుదురు.

అభావరూప అస్తిత్వము :—

423. మనోమయ ప్రపంచములో అనేకత్వమునందు ఏకత్వస్థితి ప్రారంభమగును.

మనోమయ భువనము :—

424. (అస్తిత్వముగాని అస్తిత్వము) ఉనికిగాని ఉనికి. భగవంతుని జ్ఞానావస్థానము నుండి దీని ఉనికి ఏర్పడు

చున్నది. అనంతజ్ఞానముయొక్క ప్రతిబింబము. దీనిలో సృష్టియొక్క వివరము లన్నియు ఉండును. ఇచ్చట భగవంతునికి-సృష్టికిగల సంబంధము ప్రియతముడు-ప్రేమికుడు సంబంధమువంటిది. ఇది మానవుని సత్యస్థితి. ఈ దశలలో భగవంతునియందు గల భావము అనుభూతి ఐక్యమే.

425. అయిదు, ఆరు భూమికల యందున్న (మహాపురుషుడు, వలీ) మరియు (సత్పురుషుడు, పీర్) మాత్రమే ఇతరులను తమ స్థాయికి తీసికొని పోగలరు. అట్టివారి అనుగ్రహమును పొందినవారు గొప్ప ప్రయోజనులు.

426. సూక్ష్మ ప్రపంచము నుండి నిస్సంగమును పొందినవాడు సాధుపురుషుడు (వలీ) అగును.

427. దర్శనము అయిదు, ఆరు భూమికలకు సంబంధించినది.

428. అయిదవ భూమిక యందున్న వలీ (మహాపురుషుడు), సాధకునికి, తన కరుణాదృష్టిని ఆతనిపై సారించి, తద్వారా తనస్థితిని వానికిచ్చును.

429. భూమికలలో నున్న గురువులకు ప్రత్యక్షముగా భౌతిక సంపర్కము కావలయును.

430. మానసిక భూమికలలో ఈ మనస్సే, ఈశ్వరీయముగను జ్ఞానపూర్వకముగను ఉపయోగపడుచున్నప్పుడు, ప్రాణశక్తి, పరోక్షముగను స్పృహ లేకను ఉపయోగపడుచుండును.

431. మహాపురుషుడును (వలీ 5 భూమిక) సత్పురుషుడును (పీర్ 6 భూమిక) వాస్తవముగా చమత్కారములు చేయరు. ఒకవేళ చమత్కారములు చేసినట్లు కనిపించినచో, ఆధ్యాత్మిక, ఆధిభౌతిక ప్రయోజనములను ఆశించువారి ఆలోచనలపై, అనుభూతులపై గల మానసిక ప్రభావముపై ఆధారపడి యుండి అట్లు కాన్పించును.

ఆరవ భూమిక :—

432. (అంతఃకరణము లేక హృదయము) మానసిక చైతన్యము కలవాడై మానవునిలోనున్న భగవంతుడు క్రమ క్రమముగా అంతకంతకు అంతర్ముఖుడై మనస్సుకు అధికారి యగును. ఇప్పుడితడు మనస్సుయొక్క మూర్తిమత్త్వము. మనఃస్వరూపుడు) పూర్తిగా మానసిక శరీరమందు స్పృహకలవాడై యావత్తు మనోమయ ప్రపంచానుభవములను పొందును.

ఇచ్చట భగవంతుని ఆదిమూలస్థితిని ముఖాముఖీ కన్నులార చూడగల్గును. అనగా భగవద్దర్శనము (బ్రహ్మ సాక్షాత్కారము) ప్రాప్తించును.

---

Notes:— సాక్షాత్కారము అక్షము = కన్ను సః + అక్షము = సాక్షము, కన్నుతో చూడినట్లు. సాక్షం కరోతీతి సాక్షాత్కారః = కంటికి ప్రత్యక్షమగునది.

433. అంతర్ముఖ చైతన్యప్రగతిలో, ఒకటవ భూమికనుండి ఆరవ భూమిక వరకు క్రమక్రమముగా వివిధమైన భిన్న సంస్కారములు నామమాత్రావశిష్టమై (ఇంక అసలు సంస్కారములే లేవు అన్నంతవరకు) పూర్తిగా క్షీణించి పోయినవి. కానిద్వంద్వ సంస్కార అవశేషముల చూచాయ 'జాడ' మాత్రము మిగిలియున్నది.

434. ఇచ్చట మానవునిలోనున్న భగవంతుడు మనస్సుతో తాదాత్మ్యమును చెంది "నేను మనస్సు" ననెడి అనుభవమును పొందుచుండును.

435. ఆరవ చైతన్య భూమికలో మానవుని స్థితిలో నున్న మానసిక చైతన్యుడైన భగవంతుడు, భగవంతుని ముఖాముఖీ సుస్పష్టముగా చూడగల్గినప్పటికీ, భగవంతుని సమస్తములో సర్వత్రా చూచుచున్నప్పటికీ, తానింకను మానసిక చైతన్యమందు హత్తుకు పోయి, మనస్సే తాను, తానే - మనస్సు అన్నట్టి స్థితియందుండుట చేత; తనను భగవంతునిలో చూడలేకున్నాడు.

436. ఇతడు భౌతిక సూక్ష్మలోకములందలివస్తువులనుకూడా చూడగల్గును. ఇంకను ద్వైతము నందే, ఎఱుక కలవాడై యున్నాడు. తాను "మనస్సు" గా, భగవంతుని నుండి వేరగుచున్నాడు.

437. ఇతడు భగవంతునితో ఏకత్వ మొందవలె ననెడి రసానుభూతిని, లాలసను, వియోగ విరహ వేదనను కలిగియుండును.

438. భావోత్పాదక మనస్సు (హృదయము) తో గల తాదాత్మ్యతయే దివ్య ప్రేమయొక్క ప్రబల లక్షణము. ఇది చివరకు భగవంతునితో ఏకత్వమునకు దారి తీయును.

439. ఇతనికి ఆలోచనలుండవు. స్థూల సూక్ష్మ చైతన్య స్థితులు కలిగినవారి అందరి భావములను హృదయములను పాలించును.

440. ఆరవభూమికను దాటినప్పుడే మాయ అదృశ్యమగును. సంస్కారముల అంతిమజాడ కూడా చెఱిగిపోవును. సత్యానుభూతి కలుగును.

441. అంతర్ముఖ చైతన్యము సప్తమ భూమికను చేరువరకు ద్వైతము వ్రేలాడుచునే యుండును.

442. మనోమయ గోళమండలి రెండవభాగము అనుభూతులకు (హృదయము) అధికారి. ఈ భూమిక యందున్న సాధకుడు (సత్పురుషుడు) భగవంతుని నిజ స్వరూపమును ప్రత్యక్షముగా దివ్య నేత్రము ద్వారా ఎల్లెడల చూచుచున్నాననెడి భావానుభూతిని

పొందును. కాని తనను భగవంతునిలో భగవంతునిగా చూడలేడు. ఇదియే బ్రహ్మ సాక్షాత్కారము (ఆత్మ ప్రకాశము).

443. ఇతడు మహిమలు ప్రదర్శించడు.

444. ఇచ్చట దర్శనము అనెడి ఇంద్రియ పరిజ్ఞానము మిగిలి యున్నది.

445. భౌతిక, సూక్ష్మ చైతన్యములు గల ఆత్మలయొక్క అనుభూతులపై అధికారముకల్గి వాటిని పరిపాలించును.

446. పరుల మనస్సులయొక్క తలపులయందును, తలపులు సృష్టించుట యందును సమర్థుడగును ఆత్మనిగ్రహము కలవాడగును.

447. సృష్టి అనుభవమంతయు మిథ్య ఎందుచేతననగా-సృష్టి సంబంధమైన సమస్త అనుభవములు సంస్కారముల వలన కలిగినవి. ఆ సంస్కారములు అభావము నుండి పుట్టినవి గనుక.

448. కలలతో పోల్చి చూచినచో, మానవుని భౌతిక జీవితము యదార్థము అట్లే ఆధ్యాత్మిక మార్గముతో పోల్చినచో, ప్రపంచము-ప్రపంచ జీవితము ఒక కల. భగవంతునితో పోల్చినచో ఆధ్యాత్మికమార్గము మరియొక కల.

449 ప్రపంచము, ప్రపంచానుభవములు అయదార్థమైన మాయ.

450. ఆధ్యాత్మిక మార్గము యదార్థమైన మాయ, రెండును మాయలే. భగవంతుడే ఏకైక సత్యము.

451. ఆరవభూమిక యందున్న మానవాత్మ సద్గురుసహాయము లేనిదే స్వయం కృషిచే ఆరవ భూమికను దాటి సప్తమ భూమికను చేరుట కేవలము అసాధ్యము.

452. ఆరవభూమిక యందున్న మానవాత్మకు మానసిక చైతన్యమునుండి విడివడి, తన అనంత స్థితియందు ఏకత్వాను భూతి నొందుటకును; అనంత ఆనందమును ఎఱుకతో అనుభవించుటకును, తాను శాశ్వతముగా ఆనందములోనే యున్నాననెడి అనుభూతి నొందుటలో సహాయపడుటకు ఇచ్చుటసద్గురువుయొక్క అనుగ్రహము చాలా అవసరము.

ఆత్మవిశ్వాసము:—

453. ఆరవభూమికలో ప్రత్యక్ష దర్శన అనుభవముచే భగవంతుని అస్తిత్వమును విశ్వసింతురు.

454. ప్రతి భూమికయందును మరులుగొల్పు ఆకర్షణలుండును. వాటికి లోనై, వాటిలో లీనమైన వానిని 'తన్మయుడు' లేక 'తల్లీనుడు' అందురు. ఇట్టి వానిని "మస్త్" అని కూడా అందురు.

Notes— మస్త్ – ప్రేమోన్మత్తుడు

455. భూమికలలోనున్న ఆకర్షణాలకు, వ్యామోహములకు లొంగిపోక, వాటిలో నిమగ్నుడు కాక సరాసరి చివరకు తన స్థితిని కాపాడుకొను వానిని 'సలీక్' అందురు.

456. భూమికలలోనున్న "సలీక్" సాధారణ మానవునివలెనే కన్పట్టును వానివలనే ప్రవర్తించును.

457. అట్లుకాక, కొంతమంది పై ఉభయస్థితులను కలిగి యుందురు. అట్టివారిని — మజ్‌జూబ్ స్థితి ప్రబలముగా నున్నచో 'మజ్‌జూబ్ - సలీక్' అనియు, సలీక్ స్థితి ప్రబలముగా నున్నచో 'సలీక్-మజ్‌జూబ్' అనియు అందురు.

458. భూమికలలోనున్న మజ్‌జూబ్‌ను 'మస్త్' అందురు.

మార్గములో సద్గురువుయొక్క దర్శకత్వము ఏల అవసరము ?

459. సద్గురువు సహాయము లేకుండా, మార్గములో పయనించువారు, మార్గములో గోచరించెడు తేజోవంతమైన — భ్రాంతి జనకములైన — దుస్తరములైన—వింత దృశ్యములలో చిక్కుకొని వాటినుండి తప్పించుకొని బయటకి రాలేరు. అట్టి ప్రమాదములకు లోనుకాకుండ సద్గురువు కాపాడుచుండును.

460. ఆధ్యాత్మిక మార్గము భౌతిక గోళమునకు, సత్య గోళమునకు వంతెన వంటిది.

ఆరవ భూమికలో – సత్పురుషుడు:— మానవుడు, మానవునిగా భగవంతుని ప్రతివారిలో ప్రతిదానిలో చూచును. ఇది ఆధ్యాత్మిక పంచభూతార్థములలో రెండవది.

మానవుని
ఆధ్యాత్మిక వికాసము
గుణైక్యము :—

461. ఆరవభూమికలో ఇంకను ఆత్మను వదలక పట్టియున్న భౌతికగోళ సంబధమైన భౌతిక లక్షణములు, సూక్ష్మ గోళ సంబంధమైన సూక్ష్మ లక్షణములు అన్నియు సూర్యోదయము కాగానే నక్షత్రములు కాంతిహీన మైనట్లు పూర్తిగా తొలగిపోయి కరిగిపోవును. మానవుని ఆధ్యాత్మిక వికాసములలో ఇది నాల్గవది.

మిధ్యాజీవితము ఎందుకు తప్పక నశించును ?

462. మానవుని సావధిక (పరిమిత) స్వభావ త్రయమైన స్థూల – సూక్ష్మ – కారణ దేహములు, భగవంతుని అనంత స్వభావత్రయమైన అనంతానంద, శక్తి, జ్ఞాన ములతో లంకెపడి యున్నప్పటికీ, అవి శూన్యము యొక్క ఫలితములుగా సృష్టిలో పరిమిత స్వభావము

లంగా వ్యక్తమైనందునను, మిథ్యాజీవితమునకు సంబంధించి యుండుట వల్లను మిథ్యాజీవితము నశించుచున్నది.

A భగవంతుని అనంతమైన శక్తి అపారమైనది, ఎన్నడూ తరుగనిది, నశించనిది మానవుని పరిమిత ప్రాణము అనంత శక్తితో లంకెపడియున్ననూ, తరిగి పోవుచున్నది. ఖర్చగుచున్నది. ఎందుచేతననగా—అది, శూన్యముయొక్క ఫలితముగా సృష్టిలో పరిమితప్రాణ శక్తిగా వ్యక్తమయినది.

B అనంత జ్ఞానము శాశ్వతమైనది, ఒకే విధముగానుండి సర్వ వ్యాప్తమైయున్నది. కనుక నిరంతరాయముగా సాగి పోవునది. ఏమైనను, పరిమిత మనస్సు అనంత జ్ఞానముతో లంకెపడి యున్ననూ, నాశనమగుచున్నది. చివరకు అదృశ్యమగుచున్నది. ఎందుచేతననగా – అది, శూన్యము యొక్క ఫలితముగా సృష్టిలో పరిమిత మనస్సుగా వ్యక్తమైనది.

C అనంతానందము – శాశ్వతానందము. నిరవధికమైనది, శాశ్వతమైనది. కాబట్టి అది ఏ విరుద్ధ లక్షణమును లేక యున్నది. ఇంద్రియ భోగము అనంతానందముతో లంకెపడి యున్నప్పటికీ, అస్థిరమైనది కాబట్టి అది, కష్టమనెడు భిన్న లక్షణమును కలిగియున్నది. ఇది మానవ జీవితమునకు ఆధారమైనప్పటికీ ఇంద్రియ భోగము అదృశ్యమగుచున్నది. ఎందుచేతననగా జీవి

తమే క్షణభంగురమైనది కాబట్టి. అభావ ఫలితముగా ఈ మిథ్యాజీవితము ఆభాస జీవితముగా వ్యక్తమైనది. అందుచేత ఈ జీవితము తప్పక నశించును.

## సూత్రమునకు చిత్రము

| భగవంతుని అనంత స్వభావత్రయము | అనంత జ్ఞానము | అనంత శక్తి | అనంత ఆనందము |
|---|---|---|---|
| ↓↑ | ↓↑ | ↓↑ | ↓↑ |
| మానవుని పరిమిత స్వభావత్రయం | పరిమిత మనస్సు | పరిమిత ప్రాణము | నశ్వర దేహము |




463. 'సప్త పొరల తెర'

"తేరే ఘూంఘట్ కే పట్ ఖోలే ।
తుఝె రామ్ మిలేగా" ॥

( GDS - Page 66 )
కబీర్ సూక్తి.

గౌళీ పంతురాగం – ఆదితాళం
(మాయా మాళవ గౌళ రాగ జన్యం)
త్యాగరాజ కృతి.

ప॥ తెర తీయగ రాదా ? నాలోని
తెర తీయగ రాదా ?

464. నీవు "స్వ" (మిథ్యాహం) అనెడు సప్తపొరల తెరను తొలగించినచో, భగవంతుని కనుగొందువు. ఏడు పొరలు ఏడు మూలవాంఛలను సూచించును. ఏడును సప్త జ్ఞానేంద్రియములకు సంబంధించిన సప్తద్వారములు.

1. నోరు
2. కుడి నాసిక
3. ఎడమ నాసిక
4. కుడి చెవి
5. ఎడమ చెవి
6. కుడి కన్ను
7. ఎడమ కన్ను

465. సప్త ముడులు, సప్త పొరలు.



466. సప్త ద్వారములు.




467. 5 తెరలవరకు సామాన్య మానవుడు స్వతంత్రుడై సాధించవచ్చును. కాని ఆరవ తెరను (5 భూమిక) తొలగించుటలో సద్గురు సహాయము కావలెను.

సంస్కారములు :

468. సంస్కారముల ద్వారా సృష్టి చైతన్యము సేకరించబడినది.

469. చైతన్య పరిణామములో, సంస్కారములే, భగవంతునికి మానవ స్థితి అనుభవమును కలుగ జేసినవి.

470. సంస్కారములు సృష్టి రూపముననున్న అభావమును పోషించినవి.

471. సృష్టిని పోషించుచున్న సంస్కారములు, వాటికి భిన్నమైన సంస్కారములచే పెకలించబడి, సృష్టి నాశనమై, సత్యానుభవము కలుగుచున్నది

472. సంస్కారములున్నంతవరకు, సృష్టి నిలిచియుండును, భగవంతుడు మరుగుపడి యుండును.

473. సంస్కారములు నాశనమైనచో సృష్టిఅదృశ్య మగును. భగవంతుడు కాన్పించును.

చైతన్య విమోచనము




సంస్కారముల క్షీణదశ

474. సంస్కారముల వలననే, సృష్టిలో నిద్రావస్థయు, జాగ్రదవస్థయు పగటి జీవితమును స్థాపింపబడుచున్నవి.

475. భగవంతుడు రూపముతో తాదాత్మ్యము చెందుటకు సంస్కారములే కారణము.

476. సంస్కారములే అనుభవముల నిచ్చును.

477. ఆది ప్రేరణము యొక్క పరిమాణు ప్రమాణమైన తొలి సంస్కారమే, ఆత్మయొక్క అనంత చైతన్య రాహిత్య స్థితికి, పరమాణు ప్రమాణమైన తొలి చైతన్యము నొసంగినది.

తాదాత్మ్యము:—

478. భగవంతుడు,

భౌతిక ప్రపంచములో, దేహమయ్యెను.
సూక్ష్మ ప్రపంచములో, ప్రాణమయ్యెను.
మానసిక ప్రపంచములో, మనస్సయ్యెను.
విజ్ఞాన భూమికలో, భగవంతుడయ్యెను.

"దేవుడే నీవై
నీవే దేవుడై
దివ్యత్వంబును పొందెదవు"

(మెహెర్ గీతావళి **నుండి**)

తాదాత్మ్యతలు.

"అహమ్"



479. స్థూల సంస్కార – అన్నమయ – భౌతిక లో
ములు దేహచైతన్యము కానుభవము

సూక్ష్మ సంస్కార – ప్రాణమయ – సూక్ష్మ లో
ములు దేహచైతన్యము కానుభవము

మానసిక సంస్కార – మనోమయ – మానసిక లో
ములు దేహచైతన్యము కానుభవము.

480. ఆత్మకు – స్థూల
సూక్ష్మ
కారణ దేహములు
ప్రతిబింబములు.

481. స్థూల – సూక్ష్మ – కారణ దేహములు –
పరిమితి గలవి,
రూపములు గలవి,
నశ్వరమైనవి.

482. ముల్లోకములు – అయథార్థమైనవి.
ఆభాసమైనవి
కల్పితమైనవి.
స్వప్నముల వంటివి.

483. దేనికైనను ఆది యున్నప్పుడే; అంత్యముకూడా
యుండును.

# జ్ఞానము × అజ్ఞానము


అనంతశక్తి
అవతారము
సద్గురువు
7+7=14.
C
అనంతజ్ఞానము
సలిక్
(దివ్యకూడలి)
జీవన్ముక్తుడు
అనంత ఆనందము.7
B
బ్రహ్మీ... భూతుడు
6 సత్పురుషుడు
5 మహాపు... షుడు
4 మహాయోగి
3 యోగి
2 సాధకుడు
1 జిజ్ఞాసువు
7 సామాన్యమానవుడు
6 జంతువు
5 పక్షి
4 చేప
3 క్రిమి, కీటకము
2 వృక్షము
A
భగవంతుడు.
అనంత జ్ఞానము యొక్క అవ్యక్తస్థితి.

నిర్వాణము (ఘనా)
(మనో నాశనము)

**484.** చైతన్యము సంస్కారములనుండి పూర్తిగా విడుదలై స్వేచ్ఛను పొందినప్పుడు, ముక్తి లేక 'నిర్వాణము' అందురు.

సర్వశూన్య స్థితియందు ఎఱుక.

**485.** సంస్కారములు పూర్తిగా నాశనము కాగానే ఇంత వరకు సంస్కారములలో చిక్కువడిన పూర్ణ చైతన్యమునకు పూర్తి విమోచనము ప్రాప్తించి, పరిశుద్ధమైన మహా చైతన్యముగా రూపాంతర మందినది.

**486.** మహా చైతన్యము మిథ్యాహం యొక్క చైతన్యమును గాను, దివ్యాహం (నేను భగవంతుడను) యొక్క చైతన్యమునుగాదు. ఇచ్చట చైతన్యమే యున్నది. (బాహ్యమునకు మాత్రము) భగవంతుడు లేడు. అనగా

సర్వకాల సర్వావస్థలయందు, సర్వత్రా శాశ్వతుడై యున్న భగవంతుడు, ఇచ్చట లేక పోవుట ఎట్లు సంభవించును ? భగవంతుడు ఎన్నడు ఉండకపోవుట సంభవించదు. కాని –

**487.** నిర్వాణ స్థితిలో, భగవంతుడు 'చైతన్యము' యొక్క పాత్రను వహించుచున్నాడని దాని భావము.

488. అభావమునుండి పుట్టిన సంస్కారములే, సమస్త అనుభవములకు కారణము కాబట్టి ఇచ్చట మనస్సు దాని సమస్త సంస్కారములతో సహితముగా నశించి పోయినది. పరిమిత 'అహమ్' యొక్క మిథ్యానుభవములు కూడా అదృశ్యమైనవి.

489. ఈ దివ్యశూన్యత్వము, సత్యస్థితినుండి పుట్టినదేగాని మాయ నుండి పుట్టినదికాదు.

490. అభావమైన మాయాసృష్టి అదృశ్యమైన తక్షణమే "అహం బ్రహ్మాస్మి" (నేను భగవంతుడను) అనెడు భగవదనుభూతి కలుగుటకు ఒక్కక్షణమునకు ముందుగనే, యీ దివ్య ప్రపూర్ణ పరమ శూన్యస్థితియొక్క అనుభవము కలుగును.

491. ఈసర్వ శూన్యస్థితి యొక్క అనుభవము, సామాన్య మానవునకు నిత్యము కలిగెడు సుషుప్తిలో జరుగుచునే యున్నది. పరిమిత అహము, లోకములు అదృశ్యమగుచున్నవి. పూర్ణచైతన్యము మాత్రము సుషుప్తిలో నిద్రాణమై యున్నది. సంస్కారములుకూడా అంతర్థానమైనవి.

492. సామాన్యమానవుని నిత్యజీవితములో నిత్యము కలిగెడి సుషుప్తిలో చైతన్యము నిద్రాణమై యుండగా, నిర్వాణావస్థలో చైతన్యము ఎఱుకతో నుండును.

493. సర్వశూన్య స్థితియొక్క అనుభవమే నిర్వాణము.

494. మిథ్యా జీవితములో, పరిణామములోనున్న ఫనా లలోను, ఆధ్యాత్మిక మార్గములోనున్న ఫనా లలోను చైతన్యము ఉండదు.

495. నిజమైన సుషుప్తియగు 'నిర్వాణ అవస్థ' యైన 'ఫనా'లో పూర్తి విశుద్ధ చైతన్యము ఉండును.

496. నిజమైన ఫనాకును తదితర ఫనాలకును అనంత తారతమ్యత గలదు.

497. ప్రతి భూమికకు 'ఫనా' 'బకా' లుండును. కానీ భూమికలలో నున్న 'ఫనా' ఏడవ భూమికలోనున్న ఫనా - కాదు. అట్లే భూమికలలోనున్న 'బకా' సద్గురు స్థితిలో నున్న 'బకా' కాదు.

498. ఫనా = నాశనము, అస్థిరమైన స్థితి.

499. బకా = స్థిరత్వము, ఎల్ల కాలము ఉండు స్థితి.

ఫనా × బకా

అస్థిరము × స్థిరము.

500. ఫనా :– భగవంతుని వైపు పురోగమించు ప్రయాణమునకు అంత్యము.

---

Notes :—ఫనా = నిర్వాణము; నాశనము శూన్యస్థితిలో అంతర్థానము.

Notes:— బకా = నిత్యత్వము.

బకా :- భగవంతునిలో సాగించు ప్రయాణమునకు ప్రారంభము.

ఫనా :- అన్యము, ద్వైతమదృశ్యము

బకా :- ద్వైతము అదృశ్యమైన తరువాత పొందు భగవంతుని జ్ఞానము.

ఫనా :- శాశ్వత జీవితము (బకా) నకై, ఆధ్యాత్మిక జాగృతిలో ఫలితమిచ్చుటకై. రాగములకు, ఆత్మ సంకల్పమునకు, మిథ్యాహమునకు మరణము సంభవించుట. మిథ్యాహామును మరచి పోవుట

501. నిర్వాణములో రూపము (ప్రమాణము) అదృశ్యమై, కేవలత్వము నిలిచి భగవంతుడు అగుచున్నాడు.

502. ప్రధాన దేవదూతల నివాసము మనోభువనమునకు ఆవలనున్న సప్త అంతర్లోకములు.

503. మనోభువనమునకు సత్యలోకమునకు మధ్యనున్న సప్త అంతర్లోకములు సత్యలోకమునకు సామీప్యమందున్నప్పటికీ సత్యలోకమును స్పృశించలేవు అన్నది నిజమే కాని మొత్తం నిజముకాదు.

504. ఈ గోళములోనుండి ప్రధాన దేవదూతలు భగవంతుని చూడలేరు. కాని ఆరవ భూమికలోనున్న మానవుడు భగవంతుని ముఖాముఖీ సర్వత్రా సమస్తమందు చూడగలడు, చూచుచున్నాడు.

—

శాశ్వత

అనంత

సత్యస్థితి.

*

# "అహమ్ బ్రహ్మాస్మి"

# "నేను భగవంతుఁడను"

విజ్ఞాన భూమిక

*

ఆత్మయందు
ఎఱుక కలిగిన
మానవుడు.



భగవంతుని
ఎనిమిదవపాత్ర

ఏడవభూమిక
బ్రహ్మభూతుడు.

—: గమ్య స్థానము :—

505. తన దృష్టిని క్రమముగా క్రిందికిదించి, తన పైననే దృష్టిని మరల్చుట సప్తమ భూమికను చేరుటవంటిది.

506. నిర్వాణస్థితి దాటిన తక్షణమే "అహం బ్రహ్మాస్మి" స్థితి ఎఱుకతో అనుభవనీయమగును.

507. పరిణామ మొందిన చైతన్యము, పూర్తిగా అంతర్ముఖమై, సప్తమ భూమికను చేరినపుడు దానికి పరిపక్వ దశ యేర్పడు చున్నది.

508. ఆత్మయొక్క అంతర్ముఖ చైతన్యము, సద్గురువుయొక్క అనుగ్రహము వలన సర్వోన్నతి స్థాయికి చేర్చబడి, పరమాత్మలో తన అనంత స్థితియొక్క ఆత్మానుభూతికి ఆత్మను నడిపించినది.

509. ఆత్మ, స్వీయ చైతన్యమును సంపాదించుటకు పడిన అధిక వేదనలో...

సంస్కారములు, అనుభవములు, దేహత్రయముతో పొందిన తాదాత్మ్యతలు, ముల్లోక అనుభవములు (ఆరు భూమికల అనుభవములు) వాటికి సంబంధించిన అట్టహాసము లు అన్నియు వట్టి కలమాత్రమే.

510. సప్తమ భూమికలో, ఆత్మయొక్క స్వీయ అనంత స్థితి ఎఱుకతో అనుభూతిని పొందినది.

511. నిర్వాణస్థితిలో నాశనమైన పరిమిత మిథ్యాహంయొక్క స్థానమును సత్య – అనంత – అపరిమిత దివ్య అహమ్ ఆక్రమించును.

512. నిర్వాణమే నిర్వికల్ప స్థితిగా రూపాంతర మొందును.

513. మానవుని స్థితిలో భగవంతుని 'మహా చైతన్యము' పరమాత్మపై ప్రకాశించి, పరమాత్మతో తాదాత్మ్యతను పొంది, "నేను భగవంతుడను" అనెడి అనుభవమును పొందును. ఇదియే జీవిత గమ్యము.

514. జీవిత గమ్యమును చేరుకొనుటయే నిర్వికల్ప సమాధి స్థితి.

515. సామాన్య మానవుడు నిత్యము రాత్రివేళ పరుండును. ఉదయము మేల్కొనుచుండును. అట్లే – రాత్రివేళ గాఢ నిద్రవంటిది నిర్వాణ స్థితి ఉదయము, జాగ్రదవస్థ వంటిది దివ్య జాగృతియైన నిర్వికల్ప సమాధి.

516. నిర్వికల్ప సమాధి అనగా "నేను నిస్సందేహముగా భగవంతుడను"... అనెడు స్వానుభవము.

---

Notes:— బ్రహ్మన్ = భగవంతుడు
బ్రహ్మీభూతుడు = భగవంతుడైనవాడు
బ్రహ్మీభూతుడు = "దివ్య అహం"
= దివ్య చైతన్యము (మైనస్) పరిమిత చైతన్యము.

517. "నేను భగవంతుడను" అనెడి నిర్వికల్ప సమాధిస్థితి యనుభవమును పొందుచున్న వారిని "బ్రహ్మీభూతుడు" అందురు. వీరు భగవంతుని అనంత స్వభావత్రయమైన అనంత జ్ఞాన - శక్తి-ఆనందములు, తమయొక్క అనంత స్వస్వభావమేనని, అనుభూతి నొందెదరు.

518. అనంత స్థితియందు ఎఱుకలేనట్టి అవిభాజ్యుడును శాశ్వతుడును అయిన భగవంతుడు, తన స్వీయ చైతన్యమును పొందుటకు పడిన దుర్భర వేదనతో భౌతిక ప్రపంచముయొక్క స్థూల చైతన్య పరిణామము పొడవునా, స్థూల - సూక్ష్మ - మనో ప్రపంచములను విసర్జింప చేయుచు, సూక్ష్మ మనోమయ ప్రపంచముల యొక్క - సూక్ష్మ మనోమయ భూమికలయొక్క చైతన్యమును అంతర్ముఖమొనర్చుచు, అసంఖ్యాకమైన విభిన్న సంస్కారములను ప్రోగుచేయుచు; ప్రయాణ మంతటా నశ్వరము బుద్బుదప్రాయమునైన ఉనికితో (జననము) సంగమించుచు పోవుచున్నాడు.

చివరకు పూర్ణచైతన్యము పూర్తిగా అంతర్ముఖమై, తన అనంత స్థితిలో స్వాత్మనే పరమాత్మగా అనుభూతి నొందుచున్నాడు.

519. ఆదిలో తన అనంత స్థితియందు స్పృహలేనట్టి భగవంతుడు విజ్ఞాన భూమికలో, ఇప్పుడు ఎఱుకగల్గి తాను నిజముగా ఎవరో, అట్టి వాడయ్యెను.

520. "నేను ఎవడను?" అన్న భగవంతుని తొలిపలుకునకు ఇచ్చట విజ్ఞానభూమికలో "నేను భగవంతుడను" అని సమాధానము వచ్చినది.

521. ఆదిలో భగవంతుడు భగవంతునిగా నుండెను. ఇప్పుడు భగవంతుడు భగవంతుడయ్యెను.

522. భౌతిక, సూక్ష్మ, మానసిక ప్రపంచములలో యదార్థముగా, భగవంతుడు భగవంతునిగా లేకుండెను

523. ఇచ్చట భగవంతుడు తన అనంత యదార్థ స్థితిని ఎఱుకతో అనుభవించుచున్నాడు, భగవంతుని దివ్య స్వప్నము యిక్కడితో అంతమై పోయినది.

524. భగవంతుని అనంత దివ్యసుషుప్తిలోనుండి బహిర్గతమైన అజ్ఞాత చైతనము (చైతన్య రహితస్థితి) క్రమక్రమముగా పరిణామము ద్వారా తొలి మానవ రూపము చేరుసరికి పూర్ణ చైతన్యమైనది

525. అసంఖ్యాక జన్మలనంతరము, యీపూర్ణ చైతన్యమే ఆధ్యాత్మిక మార్గములో పూర్తిగా అంతర్ముఖమై "నేను భగవంతుడను" అనెడి అనంత దివ్య జాగృతిని ఎఱుకతో అనుభవించును.

526. భగవంతుడు తనను స్వీయముగా కనుగొనుటకు తన దైవత్వమును మానవునిలో కోల్పోయెను. అట్లే - మానవుడు తన మానవత్వమును భగవంతునిలో కోల్పోయిన క్షణమే - తాను శాశ్వతుడననియు, అనంతుడననియు, తన స్వీయ సత్యానుభవమును పొందెను.

527. భగవంతుడు మానవుని స్థితిలో పరిమితమైన స్థూల, సూక్ష్మ, కారణ దేహములయొక్క పరిమిత "అహమ్" ద్వారా తాను మానవుడనే యని వక్కాణించు చున్నాడు తరువాత చిట్ట చివరకు అనంతజ్ఞాన శక్త్యానందములను వ్యక్తపరచి, తన అనంత దివ్య అహమ్ ద్వారా తాను భగవంతుడననెడి అనుభవమును పొందుచున్నాడు.

528. భగవంతుని అనంత స్వభావత్రయము

అనంత జ్ఞానము,

అనంత శక్తి,

అనంత ఆనందము.

529. విజ్ఞాన భూమిక యందున్న "మజ్‌జూబ్"ను బ్రహ్మీభూతుడందురు

---

Notes :—Fanafillah = భగవంతుని ఆనందస్థితి

Baqabillah = భగవంతుని దివ్య జ్ఞానస్థితి.

ఫనా - ఫీ - అల్లాహ్ =

బకా - బీ - అల్లాహ్ =

## భగవంతుని చరమ (పరమ) స్థితి.

530. భగవంతుని అనంత సాంఖ్యానిక స్థితులలోగల మూలాధార స్థితి. ఇచ్చట భగవంతునికి చైతన్యమున్నది (శాశ్వతముగా చైతన్యమందు ఎఱుకయున్న స్థితి). శాశ్వతముగా భగవంతుడున్నాడు అను పరాత్పరుని యొక్క చైతన్య స్థితి (పరమాత్మ స్థితి).

531. భగవంతుని చైతన్యస్థితియే - పరమాత్మ.

532. భగవంతుడు, తాను పరాత్పరునిగా శాశ్వతుడనై యున్నానని, తన అస్తిత్వమును ఎఱుకతో అనుభవించుటయే పరమాత్మస్థితి. ఈ సత్త్యానుభవము ఒకసారి ప్రాప్తించినచో అది శాశ్వతముగా నిలిచి యుండును.

533. పరమాత్మలోనున్న ఆత్మ జీవాత్మయై, సంస్కారముల నుండి ముక్తిపొంది, పరమాత్మలో, శివాత్మ యైనది. పరమాత్మలో లీనమై పరమాత్మతో తాదాత్మ్యత చెంది, తాను పరమాత్మనని అనుభూతి నొందుచున్నది.

534. 'పరమాత్మయే ఆత్మ' అన్నది శాశ్వత సత్యము.

ప్రశ్న :—

535. వాస్తవికముగా ఆత్మయే పరమాత్మ అయితే, ఆత్మకు అప్పుడు పరమాత్మలో లీనము కావలెననెడి పరిస్థితి దానికెట్లు కలుగుచున్నది ?

జవాబు:—

వాస్తవమునకు ఆత్మయే-పరమాత్మయని గ్రహించుటకై మనము పరమాత్మను అనంత అపార సాగరముతో పోల్చుకొందము. పరమాత్మయైన ఆత్మ, అనంత అపార నిస్సీమ మహాసాగరమునుండి ఎన్నడు బయట పడవాలదు. ఎందుచేతనో

ఆత్మయనెడు బిందులవలేశము, పరమాత్మయనెడు మహాసాగరములో నున్నంతవరకు, అది మహాసాగరములో కలిసియే యున్నందున ఆత్మకూడా పరమాత్మయే.

సాగరమునుండి బిందులవలేశమును వెలికి తీసినప్పుడు అది ఆత్మయైనది. నీటి ఉపరితలమున బుడగగా యేర్పడినప్పుడు దానికి పరిమితి రూపము, ఆకృతి, రంగు యేర్పడుచున్నవి.

అనగా –

ఆత్మయనెడి లవలేశము, అనంత అపార సాగరము నుండి వేరుపడినప్పుడే దానికి బిందురూపము లేక బుద్బుదరూపము యేర్పడి పరిమిత వ్యక్తిత్వము కలుగు చున్నది. ఇటు వేరైన బిందులవలేశము తిరిగి సాగర జలములో కలిసిపోయినప్పుడు, అది కూడా సాగరమే యైనది కనుక వాస్తవమునకు "ఆత్మయే పరమాత్మ"

536. ఆదిలో ఆత్మగా నుండెను.
మధ్యలో జీవాత్మగా మారెను.
అంత్యములో పరమాత్మ మయ్యెను.

537. ఆత్మయనెడి బిందువునకు, పరమాత్మయనెడి సాగర మందలి నీటిమట్టముపై బుద్బుద (బుడగ) రూప మేర్పడినప్పుడు, ఆ బుడగ ద్వారా తాను వేరనియు సాగరము వేరనియు భావించుటలో స్వయముగా పరి మితిని, రూపమును, రూపము ద్వారా స్పృహ పూర్వ కమగు అజ్ఞానమును సేకరించు చున్నది.

538. అజ్ఞాన మనెడి ఆ బుడగ చితికిపోయినప్పుడు బిందువు సాగరములో కలిసిపోయి సాగరమే అయిపోయినది.

కనుక, ఆత్మ పరమాత్మలో నుండుటయేగాక వాస్తవ మునకు ఆత్మయే పరమాత్మ.

**539.** తమయందు ఎఱుకలేకున్న ఆత్మలు, జీవాత్మలుగా, పరిణామ దశలు, పునర్జన్మలు ఆధ్యాత్మిక మార్గము అను మూడు ప్రక్రియలను దాటి శివాత్మలైనవి.

---

Notes:— జీవము + ఆత్మ = జీవాత్మ (మానవుడు)

జీవము = ప్రపంచ సంబంధమైన వాంఛలు.

జీవము = మిథ్యాహంతో కూడిన జీవితము.

జీవాత్మలో జీవము పోగా, ఆత్మమిగులును.

(అనగా మానవునిలో వాంఛలు నశించినచో, మానవత్వము పోయి దైవత్వము ప్రాప్తించి అతడే భగవంతుడగును)

శివాత్మన్ = భగవంతుడైన మానవుడు.

= బ్రహ్మీభూతుడు;

= "అహం బ్రహ్మాస్మి" స్థితి.

= నిర్వికల్ప సమాధి స్థితి.

జీవ - శివాత్మన్ = సద్గురువు

శివ - జీవాత్మన్ = అవతార పురుషుడు.

పురుషుడు = ఆత్మ, భగవంతుడు.

పరమ + ఆత్మ = పరమాత్మ,

పరమ = సర్వోత్తమమైన

ఆత్మ = భగవంతుడు.

**540.** భగవంతుడు :—

భౌతిక ప్రపంచములో – దేహ స్వరూపునిగను
సూక్ష్మ ప్రపంచములో – శక్తి స్వరూపునిగను
మానసిక ప్రపంచములో – మనోమయస్వరూపునిగను
నిర్వాణములో – చైతన్య స్వరూపునిగను
విజ్ఞానభూమికలో – ఆత్మస్వరూపునిగను వ్యవహరించు చున్నాడు.

**541.** ఆత్మ, పరమాత్మ స్థితిలో లీనమై పరమాత్మయైనప్పుడు; ఎఱుకలేని పరాత్పరస్థితియందు ఇప్పుడు పూర్తి ఎఱుకను కలిగియున్నది.

**542.** ఎఱుకలేని పరాత్పరుని యొక్క ఎఱుకయు, అనుభవమును కలిసి పరమాత్మ స్థితి.

**543.** సంస్కారములతో కలిసియున్న నిర్ముక్త చైతన్యము = = ఎఱుకతో కూడిన అజ్ఞానము.

**544.** సంస్కారములనుండి బయటపడిన ముక్త చైతన్యము = = ఎఱుకతో కూడిన జ్ఞానము.

**545.** గమ్యమును చేరగనే, శివాత్మలందరు తమ స్వీయ స్వభావత్రయమైన అనంత సచ్చిదానందములను అనుభవించుచున్నప్పుడే, దివ్య వారసత్వమైన అనంతానందమును నిస్సంకోచముగా నిరంతరముగా ఎఱుకతో అనుభవింప సాగెదరు.

**546.** భగవంతుని దివ్య సుషుప్తిలో నిద్రాణమైన సంస్కారముల ద్వారా సచరాచర సమన్వితంబైన మాయ సృష్టింపబడి, భగవంతుని దివ్య స్వప్నములో (వర్తమానములో) పోషింపబడి, దివ్య జాగృతియైన భవిష్యత్తులో నాశనమగుచున్నది.

అనగా –

మానవ రూపములోనున్న భగవంతుడు, దివ్యత్వసిద్ధిని పొందుటతో మాయా సృష్టి నాశనమగుచున్నది

547. మిథ్యాహము నుండి నిస్సంగమును పొందినవాడు భగవంతుడగును.

548. ఉన్నత చైతన్యము :- మానవుడు
ఉన్నతతర చైతన్యము ,- ఆధ్యాత్మిక మార్గము
మహోన్నత చైతన్యము :- భగవంతుడు.
సర్వోన్నత చైతన్యము :- సద్గురువు లేక అవతార పురుషుడు

549. సృష్టి రూపములలో ఉన్నత చైతన్యము :- మానవుడు
మానవులలో మహోన్నత చైతన్యము:- భగవంతుడు

550. భగవదనుభూతి పరుడైన మానవుడు (జ్ఞానముతో, విశుద్ధ చైతన్యముతో కూడిన) సర్వశక్తిమంతుడు. సత్యస్థితి యందు జాగరూకుడై యుండును. అతడే-

జ్ఞానము - జ్ఞాని - జ్ఞేయము
ప్రేమ - ప్రేమికుడు - ప్రియతముడు

ప్రతి జీవాత్మలో తానున్నాననియు, తనలో ప్రతి జీవాత్మ ఉన్నదనియు ఆతడెరుంగును. ఆతడే సమస్తమునకు ఆద్యంతములని కూడా ఎరుంగును. తాను శాశ్వతముగా, ఆ... సత్యసాగరునిగనే యుంటిననియు, ఉన్నాననియు, ఉందుననియు ఎరుంగును.

కాని, సామాన్య మానవునకు తానెక్కడనుండి వచ్చెనో, ఎక్కడికి పోవునో తెలియదు.

551. ఆత్మ, అనుభవ పూర్వకముగా, ఆత్మజ్ఞానమును సంపాదించుటకు గల "ప్రథమ ప్రేరణము"ను ఇచ్చుటే సార్థక పరచినది.

552. మానవునకు అజ్ఞానము ఉన్నంతవరకు మాయారూప సమన్వితంబైన బహుత్వమునకు అంత్యము లేదు. అట్లే –

దివ్య జ్ఞానము సిద్ధించిన తరువాత, భగవంతుని అఖండ ఏకత్వమునకు కూడా అంత్యములేదని మానవుడు గ్రహించును.

553. వాస్తవము ఏమనగా :–

మానవుడే దేవుడయ్యెను.

మానవుడే దేవుడు కాగలడు.

తెలిసినను తెలియక పోయినను,

మానవుడే భగవంతుడు.

554. సప్తమ భూమికలో, నిజమైన అనుభవముచే భగవంతుని అస్తిత్వమును నమ్మెదరు.

555. నిజమునకు, ఆద్యంతములు లేకుండా ఎల్లప్పుడు 'ఆత్మయే భగవంతుడు' అన్నది ఏకైక సత్యము.

556. ఆత్మ, పరిణామ దశలలోనికి దిగుటతో అయదార్థపు మాయ ప్రారంభమైనది. విజ్ఞాన భూమికలో ప్రవేశించుటతో యదార్థపు మాయ అంతమగుచున్నది.

557. ఆధి భౌతికమును భగవంతుడే, ఆధ్యాత్మికమును భగవంతుడే. ఈ రెంటికీ అతిశయుడును భగవంతుడే.

558. భగవంతుని చైతన్య రాహిత్య (II A) స్థితిలోనున్న భగవంతుడు, స్వీయమైన అనంతలీల ద్వారా, తన స్వీయ సత్యము యొక్క చైతన్యమును పొంది, తన అనంత స్వభావత్రయమును (II B) స్థితిలో అనుభవించెను.

చైతన్య ప్రవృత్తి:—

559. అనంత సమత్వానుభూతి పొందుటకు నూతనచైతన్యము లేదు. పరాత్పర స్థితిలో అంతర్నిహితమైయున్న చైతన్యమే, వెల్లుబికి క్రమక్రమముగా పరిణామము చెందుచు, పూర్ణమైసృష్టితో సంగమించి సృష్టియొక్క అనుభవము నిచ్చినది.

ఈ పూర్ణ చైతన్యమే అంతర్ముఖమై అనంత సత్యమును ఏకైక సత్యముగా తన నిజమైన స్వీయమైన శాశ్వత అనంత స్థితి యొక్క అనుభవమును కలుగజేసెను.

భగవల్లీల :—

560. పరాత్పర పరబ్రహ్మ స్థితిలోనున్న భగవంతుడు, తాను శాశ్వతుడు అనంతుడు అయియున్ననూ, తన అనంత

శాశ్వత అస్తిత్వమందుగాని తన స్వీయ అనంత స్వభావమందుగాని ఎఱుక లేకున్నప్పుడు... తన అనంత ఆది విలాసము కారణముగా తన అనంత జ్ఞాన - శక్తి - ఆనందములైన అనంత శాశ్వత స్వభావత్రయమందు అనుభూతి కలవానిని చేసినది.

561. భగవంతుడు ఎప్పుడును తన అనాది స్థితియైన పరాత్పర స్థితి యందు ఎఱుక లేకుండెను. కాని నూతనముగా సంపాదించిన శాశ్వత అనంత చైతన్యముతో తన పరాత్పర స్థితియందు జాగరూకుడై యున్నాడు.

562. చివరకు చైతన్యమే భగవంతుని, తన స్వీయ సత్యమును తెలిసికొనునట్లు చేసినది.

563. శాశ్వతమైన భగవంతుని అనంత స్థితిని ఎఱుకతో అనుభూతిని పొందుటయే: జీవిత గమ్యము.

564. మానవరూపములో "అహం బ్రహ్మాస్మి" స్థితినిపొంది, సత్యానుభవమును పొందుటయే గమ్యస్థానము.

అనుభవ దివ్యత్వము.

565. ఈ స్థితిలో (II B) మానవుడు తన స్వభావము అనంతానందమేగాని పరిమిత స్థూలకాయము కాదనియు, అనంతశక్తియేగాని పరిమిత ప్రాణము కాదనియు, అనంత జ్ఞానమేగాని పరిమిత మనస్సు కాదనియు అనుభవమును పొందును.

566. చైతన్యము సంస్కారములను పూర్తిగా వదలిన తరువాత ఇంకెన్నడును అయథార్థపు అభావమును నిజమని అనుభూతి నొందక సత్యమునే అనంత పరమాత్మగా అనుభవమును పొందును.

567. భగవంతునికి మొదటి స్థితియైన పరాత్పరస్థితి, రెండవ స్థితియైన పరమాత్మ స్థితి ద్వారా అనుభవమయ్యెను.




568. సత్యానుభవము వ్యక్తిగతమైనది.

569. సంస్కారములు పోగొట్టుకున్న పూర్ణ చైతన్యమే, ఆత్మ యొక్క "అహం బ్రహ్మాస్మి" స్థితియొక్క పరమానుభూతిని అనుభవించగలదు.

570. సప్తమ భూమికలోని నాదము, దృష్టి (దర్శనము) వాసనలు దివ్యములు. ఇచ్చట వినుట, చూచుటవాసన చూచుట అను వృత్తులు లేవు. ఆతడే శ్రవణ-దర్శన-ఆఘ్రాణములై పోవును.

571. పరమాత్మలో అనంతముగా ఎఱుక లేకున్న A స్థితి, 3, 4, 5, 6, 7 స్థితుల ద్వారా క్రమముగా 8 వ స్థితి B లో అనంతమైన ఎఱుకను పొందెను. ఇది నిర్గుణ నిరాకారస్థితి.

572. ఇచ్చట భగవంతుడు తన సత్య స్థితియందు ఎఱుక కల్గి మాయా సృష్టియందు ఎఱుక లేకున్నాడు.

573. ఆత్మలు బాహ్యమునకు తాము పరమాత్మనుండి వేరు పడి యున్నామనెడి అనుభవము ద్వారానే, తమ అఖండ ఏకత్వమును పరమాత్మగా ఎఱుకతో అను భూతి నొందినవి.

574. బ్రహ్మీభూతస్థితిలో, అచ్చట పరోక్షముగా గాని ప్రత్యక్ష ముగా గాని మహిమలు లేవు.

575. హాకీకత్ :—(బ్రహ్మజ్ఞానము)
పరిమిత అహం, అంటు లేకుండా పోయి, ద్వైతము పూర్తిగా అదృశ్యమైన తరువాత, మానవుడు ఈ జ్ఞాన మును చేరుకొనును.

576. సర్వ సాధారణముగా ప్రతియొకడును సర్వోత్తమ జ్ఞాన మును బడయుటకు మధ్యతరగతులను దాటి రావలసి నదే. కాని సద్గురు దర్శకత్వములో మెలగినవారు, యీ మధ్యే మార్గములనుదాటి ఒక్కసారిగా బ్రహ్మ జ్ఞానమును పొందుదురు.

577. సప్తమ భూమికలో బ్రహ్మీభూతుడు:_ఇచ్చట భగవంతుడు భగవంతునిగా తనను ప్రతివారిలో ప్రతిదానిలో చూచును. ఇది పంచ ఆధ్యాత్మిక సత్యములలో నొకటి.

578. స్వరూప ఐక్యము:–

మానవుని ఆధ్యాత్మిక వికాసములలో నిదియొకటి. ఇది భగవంతుని సత్యస్థితి (సత్యగోళము) ఈ గోళములో భగవంతుని అనంత శక్తి, జ్ఞాన, ఆనంద స్థితులు ఇమిడి యున్నవి.

హకీకత్.

ముకామ్_ఏ_మొహమ్మదీ | హకీకత్ కీ కుద్రత్

హకీకత్_ఏ_మొహమ్మదీ | హకీకత్ కీ మారేఫత్

హాలత్_ఏ_మొహమ్మదీ | హకీకత్ కీ ముసర్రత్




సత్యస్థితి.

579. భగవంతుని అనాది అనంతస్థితి.

| | | |
|---|---|---|
| ముకామ్_ఏ_మొహమ్మదీ | హకీకత్ కీ కుద్రత్ | అనంతశక్తి |
| హకీకత్_ఏ_మొహమ్మదీ | ,, కీ మారేఫత్ | అనంత జ్ఞానము |
| హాలత్_ఏ_మొహమ్మదీ | ,, కీ ముసర్రత్ | అనంతఆనందము |

పరమాత్మ :—

580. భగవంతుని బాహ్యస్థితి. ఎఱుకతోకూడినఏకత్వము. ఏకమ్. అనుభవాతీతస్థితి యొక్క అనుభవస్థితి. పరమాత్మ స్థితి ద్వారా భగవంతుడు అనుభవాతీత స్థితి యందు ఎఱుక కల్గియున్నాడు.

581. పరమాత్మ B స్థితియందున్న భగవంతుడు పరాత్పర స్థితి లోనికి వెనుకకు మఱలడు. తాను అనంత జ్ఞాన శక్త్యానందములైన అనంత అస్తిత్వమై యుంటి ననియు, ఉన్నాననియు ఉందుననియు ఆతనికి తెలి యును. పరాత్పర స్థితి తనయొక్క మూలస్థితియని కూడా తానెరుంగును.

582. ఏకత్వ అస్తిత్వము :— (ఎఱుకగల అద్వైతస్థితి) పంచ ఆవిష్కరణములలో నిది యొకటి. సత్యగోళములో ఎఱుకతోకూడిన ఏకత్వము.

హాలత్ - ఏ - మొహమ్మదీ.

583. సిద్ధ పురుషులైన సద్గురువు, అవతారపురుషుడు, తమ ఉద్యోగానంతరము దేహములను చాలించిన తరువాత ఈ B స్థితిలో నివసింతురు.

సత్యగోళము :—

584. ఈ గోళము స్వయం రక్షకమైనది. శాశ్వతత్వములో "అహం బ్రహ్మాస్మి" యనెడు భగవంతుని స్థితియిందు ఎఱుక కల్గియున్నది.

585. మానవుడు పరస్పరాశ్రితములైన యీ నాలుగు గోళములను దాటి తనదైన సత్యగోళములోనికి ప్రవేశించెను, ప్రవేశించును.

586. ఐదవ గోళము లేక, సప్తమ భూమికే ఏ గోళమును కాదు. లేక, ఒక భూమికయును కాదు. అని చెప్పుటలో పొరపాటు లేదు. అది భగవంతుని స్వీయాస్తిత్వముయొక్క సత్యస్థితి.

587. అనంత జ్ఞాన శక్త్యానందముల సప్తమ భూమికలో జీవాత్మ భగవంతునిలో లీనమై, భగవంతుడే యగును. ఎల్ల కాలము లయందు కాలమును అధిగమించి యుండును. అప్పుడతనికి శరీరమున్నను లేనట్లే పరిగణించబడును.

సత్యధర్మము ననుసరించి పరమాత్మానుభూతి నొందిన కొద్దికాలములో ఈ స్థూల కాయము రాలి పోవును.

588. మానవుడు తన ప్రధాన పరిమిత స్వభావత్రయమగు స్థూల – సూక్ష్మ – కారణ దేహములు పోగొట్టు

కొనినను. తన దుర్భరవేదనలో సంపాదించిన పూర్ణ చైతన్యము మాత్రము ఒకసారి లభించినచో అది మరెన్నటికిని పోదు.

589. ఇచ్చట మానవుడు భగవంతునిలో ప్రవేశించెను. కాని భగవంతుని జీవితములో మాత్రము ప్రవేశించలేదు.

తొలి దివ్య యానము.

590. గమ్యస్థానమును చేరుకొనుటతో తొలిదివ్యయానము ముగిసెను. ఇక్కడ మానవుడు భగవంతుడయ్యెను. ఇతడిప్పుడు భగవంతుని జ్ఞానమును, భగవంతుని శక్తిని, భగవంతుని ఆనందమును అనుభవించు చున్నాడు. ఇది గమ్యస్థానమైనప్పటికి పూర్ణస్థితి కాదు.

591. మానవుడిప్పుడు "అహంబ్రహ్మాస్మి" స్థితితోపాటు అనంత జ్ఞాన శక్త్యానందముల అనుభవమును పొందు చుండును. బ్రహ్మనంశమయుడై యుండును.

లాహూద్

(లేక)

భగవంతుని అద్వైతస్థితి

592. భగవంతుని ఏకత్వస్థితి నిర్వివాదాంశమైనది. లోకప్రసిద్ధ మతములన్నింటికి ఇది పునాది. ఆధ్యాత్మిక శిక్షణకు ఇది గమ్య స్థానము. సిద్ధాంతములో భగవంతుని

ఈయేకత్వస్థితిని అంగీకరించుటకు ప్రజాసామాన్యమునకు విశేషాధికారమున్నది. కాని దానిని గురించి పరిశోధించువారు మాత్రము బహు కొలదిమంది యుందురు. అది సులువైనది, కష్టమైనది, సార్వజనీనముగా తౌహీద్ ను గురించి, ధర్మోపదేశ పీఠమునుండి, ఉపన్యాస వేదిక నుండి మాట్లాడుట చాలా సులువుగా నుండును. కాని దానిని సాధించుట బహుకష్టము.

593. భగవంతునితోగల ఐక్యము, దాని సర్వాతిశయమైన అవస్థలో, అది కేవలమును ఏకత్వమే. కేవలమును అద్వైతమే.

594. తౌహీద్ అనగా సంస్కార రహితమైన సత్యస్థితి, ఇచ్చట జ్ఞానము కలుగును. ఇచ్చట భగవంతుడు తాను పూర్వమున్నట్లుగనే పవిత్రుడై యుండును.

595 తౌహీద్ భగవంతుని జ్ఞానము. ఈజ్ఞానము బ్రహ్మజ్ఞానిని సత్యజీవితమును అపనమ్మక బ్రతుకును కేటాయించగల సమర్థుని కావించును. తౌహీద్ యొక్క అతీతావస్థ, తౌహీద్ నే కాదని, లోన ఇముడ్చుకొనును.

596 ప్రియతముని గుణములలో (విశేషణములలో) ప్రేమికుడు కరిగిపోవుటయే "తౌహీద్"

ఐక్య అస్తిత్వము

సత్యగోళము

597. సత్య భువనమందలి ఆలమ్-ఈ-లాహూత్‌లో-

భగవంతుడు తొలిసారిగా తనఏకత్వమందుఎఱుకగల వాడయ్యెను. ఆలమ్-ఈ-హాహూత్‌లో అనేకత్వము లోగల ఏకత్వమందు ఎఱుకగల ఏకత్వము కలవాడయ్యెను. దీనిని హకీకత్ - ఏ - మొహమ్మదీ అని కూడా అందురు.

సూఫీల భావన ప్రకారము, పరాత్పరస్థితిలో గుప్తమైన పరమనిధి యుండెను. అది తనను తాను తెలిసికొన గోరెను. ఇట్లు తనలో ఒక వాంఛ కలిగిన తత్క్షణమే, తాను ఒక మహా తేజస్సుగా ఎఱుకను పొందెను. ఈమహా తేజస్సులో సమస్త సృష్టియు, దాని ఆవిష్కారములును అంతర్నిహితములై యుండెను.

దీనిని గురించి మొహమ్మద్ ప్రవక్త ఇట్లు చెప్పెను. "భగవంతుడు నా తేజస్సును సృష్టించెను. నా తేజస్సులోనుండి ఈ విశ్వము ఉనికిని పొందెను."

భగవంతుని జ్ఞానములో అద్వైత స్వరూపముతో సహా ఇది పరమసౌందర్యలక్షణము (సర్వం సుందరమ్)

ఇచ్చట భగవంతునకు - సృష్టికిగల సంబంధము ప్రేమికునకు - ప్రియునకు గల సంబంధము వంటిది.

ఇచ్చట భగవంతుడు ప్రేమికుడు, మహాత్ములకు ప్రియతముడు. భగవంతుడిచ్చట తనయందు సృష్టియందు ఎఱుకగలవాడయ్యెను.

సద్గురువు లేక అవతారము:




598 తజల్లీ = దివ్య తేజస్సు, నూర్, ఈశ్వరీయ ప్రకాశము

జమాలీ = (సత్యసుందరుడు) పరమరూపవంతుడు భగవద్విశేషము.

జలాలీ = పరమ తేజోవంతుడు (భగవద్విశేషము) పరాక్రమ వంతుడు.

599. తజల్లి - ఎల్ - జమాలీ:- (ఐక్య అస్తిత్వము) పరాత్పర స్థితిలో ఇది మొదటి హద్దు. దీనిని లాహూత్ అందురు. ఇది జ్ఞేయ అస్తిత్వము వలన ఉపయోగింపబడి నప్పుడు, ఆతనికి "ఫనా" "బకా"ల యొక్క అనుభవము నిచ్చును. ఈ స్థితి-ఆధ్యాత్మిక మార్గమందలి

ఇతర అవసలవలెనే, మనోబుద్ధులకు అతీతమైయుండును. అనిర్వచనీయము.

600. ఆలమ్-ఏ-లాహూత్‌లో ఒకనిలోనే ప్రేమికుడు-ప్రియ తముడు.

ఆలమ్-ఏ-హాహూత్‌లో ఏక కాలమందే ప్రేమికుడు ప్రియతముడు.

601. తజల్లి-ఎల్-జలాలీ:—

ఈ స్థితి ఒక ఆత్మకు నిర్వాణ అనుభవము నిచ్చును. "తజల్లీ - ఎల్ - జమాలీ" ఆతనికి మరియొకసారి సాధారణ చైతన్యమును ప్రసాదించును. దీనిని సూఫీలు "బకా" అందురు.

ఇచ్చట భగవంతుడు ప్రియతముడు, మానవుడు ప్రేమికుడు; తజల్లి - ఎల్ -జమాలీలో భగవంతుడే ప్రేమికుడు, మానవుడు ప్రియుడు.

602. సాధారణముక్తి :-

ఈ ముక్తి మరణానంతరము శరీరము లేకుండా 3 నుండి 5 రోజులలోగా లభించు ముక్తి. భగవంతుని యందు భయము, సత్యప్రేమికులు, సజ్జనులు మొదలగు ఎవరికో కొలదిమందికి మాత్రమే లభించును.

ఈ ముక్తిని పొందిన ప్రత్యగాత్మ, అనంతజ్ఞానము, అనంత శక్తియు అచ్చట యున్ననూ ఆనందమును మాత్రమే అనుభవించుచు దానియందే ఎఱుక కలిగి యుండును. ఇతనికి సృష్టి లేదు. జనన - మరణముల సంసార చక్రము తిరుగుట నిలిచి పోయినది.

"అహం బ్రహ్మాస్మి" స్థితియొక్క గాని ద్వైతము యొక్క గాని చైతన్యము లేదు. సృష్టిలో కర్తవ్యము (అధికారము) లేదు.

603. నిర్వాణము

నిర్వికల్పము

శరీరము నిలిచియుండగనే ఇది ప్రాప్తించును. అప్పుడు విదేహము కూడగును. దేహమునకు ముక్తి కాదు. దేహము కాని దానికి - అనగా, స్వాత్మకు ముక్తి లభించును.

604. విదేహముక్తి :-

మానవుడు భగవంతుడైన తరువాత 3 లేక 4 రోజుల వరకు అతని శరీరము నిలిచి యుండును. ఇతని చైతన్యము పూర్తిగా భగవంతునిలో కరగిపోవును. కనుక దేహములయందు, సృష్టియందు స్పృహయుండదు. వారు నిరంతరముగా సచ్చిదానంద స్థితిని అనుభవించుచుందురు, కాని వాటిని సృష్టిలో ఎఱుకతో

వినియోగించరు. ఇతరులు ముక్తులగుటకు సహాయపడరు. కాని, వారు భూమిమీద ఉన్నకొలది రోజులు, వారి సాన్నిధ్యము అనంతజ్ఞాన శక్త్యానందములను ప్రసారము చేయుటలో కేంద్రముగా నుండును; వారిని దరిచేరువారును, సేవించువారును, పూజించువారును, మిక్కిలి ప్రయోజనమును పొందెదరు. ఇతరులు తమ తమ ప్రారబ్ధము ననుసరించి సంవత్సరముల కొలది శరీరములను నిల్పుకొందురు.

605. ఆత్మ, స్వీయ చైతన్యమును పొందిన తరువాత మూడే మూడు స్థితులను అనుభవించును.

(a) బ్రహ్మభూతుడు :—

జీవుడు ఆత్మ చైతన్యుడు కాగానే, సాధారణముగా తనకు నీడగా నున్న దేహత్రయమును విడిచి, శాశ్వతముగా సచ్చిదానంద స్థితిని ఎఱుకతో అనుభవించును. కాని వాటిని అన్యునికై వినియోగించడు.

(b) ఆత్మ దేహత్రయమును కొంతకాలముపాటు వదలకపోవచ్చును. కాని వాటియందు స్పృహ యుండదు. దేహములను విడిచిన (a) వానికిని, ఇతనికిని ఏమియు భేదము లేదు.

—

## జీవన్ముక్తుడు

606. భగవంతునిలో ప్రవేశించి, భగవంతుడైన తరువాత భగవంతుని జీవితములో స్థిరపడుటకు మధ్యలో తురీయ అవస్థ యనెడు దివ్యకూడలి యున్నది.

607. భగవంతుడు 8 వ స్థితిలో (పరమాత్మలో B స్థితి) సత్యానుభూతిని పొంది, తిరిగి దేహత్రయము ద్వారా మూడు లోకముల చైతన్యమును పొందుటకై 10 వ స్థితికి C వచ్చుటకు మధ్యలో 9 వ స్థితియైన దివ్య కూడలి (తురీయావస్థ) యున్నది.

608. తురీయ అవస్థయందు కొంతసేపు బ్రహ్మీభూత స్థితియు, మరికొంతసేపు సలీక్ స్థితియు నుండును. ఇట్టి వానిని 'సలిక్ - మజ్‌జూబ్' అనిగాని 'మజ్ జూబ్-సలీక్' అని గాని యందురు. వీరినే జీవన్ముక్తులని, పరమహంసలనికూడా అందురు.

609. జీవన్ముక్తుడు తురీయ అవస్థలో అనంత సచ్చిదానంద మును అనుభవించుచుండును. ఆతని చైతన్యము

కొంత సేపు "నేను భగవంతుడను" అను స్థితియందును, మరొకప్పుడు దానితోపాటు ముల్లోకములతోనూ కూడి యుండును. కాని సృష్టిలో కర్తవ్యము లేనివాడై సచ్చిదానంద స్థితిని అన్యులకై వినియోగించడు.

610. జీవన్ముక్తుడు తన జీవితాంతమందు మాత్రము ఒకనిని తనవలె పరిపూర్ణుని చేయును.

611. ఆత్మ స్వీయచైతన్యమును పొందిన తరువాత అనుభవించు అవస్థలు మూడింటిలో జీవన్ముక్తి రెండవది.

భగవంతుని
పదవపాత్ర

## సద్గురువు

గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః
గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్ పరం బ్రహ్మ
తస్మై శ్రీ గురవేనమః

612. భగవంతుని 10 వ స్థితిలో నున్నవారు సద్గురువులు, అవతార పురుషుడు.

613. భగవంతుని 10 వ స్థితిలో సద్గురువు, భగవంతుని అనంత జ్ఞాన, శక్తి, ఆనందములను అనుభవించుటయేగాక, వాటిని భగవత్కార్యాలయము ద్వారా పరుల కై వినియోగపరచును.

614. మానవునిగానున్న భగవంతుడు, భగవంతుని స్థితిలో గమ్యస్థానమును చేరిన తరువాత చాలా అరుదుగా తన అనంతానందమును వీడి, సాధారణ చైతన్య స్థితికి క్రిందికి దిగివచ్చును. అనగా భగవంతుని జీవితములో స్థిరపడును. ఇచ్చట మానవునిలో భగవంతుని జీవితము ప్రతిష్ఠింపబడినది. ఇదియే ఆత్మ ప్రతిష్ఠాపనము.

615. మానవుడు నిత్యజీవితములో సుషుప్తి అవస్థకు పోవునప్పుడు నిర్వాణస్థితి ఏర్పడుచున్నది. ప్రతిదినము మేల్కొనిన తరువాత ఏర్పడు వ్యక్తిగతజీవితము వలన ఆత్మ ప్రతిష్ఠాపనము ఏర్పడు చున్నది. (ఫనా మరియు బకా)

616. మూడు రకముల 'ఫనా' – 'బకా' లు.

(a) సృష్టిలోనుండు సమస్త జీవరాసులలో జరుగుచుండు ఫనా–బకా.

(b) ఆధ్యాత్మిక మార్గములో, ఒకటవ భూమికనుండి ఆరవ భూమిక వరకు, చైతన్యమునకు విముక్తిని కల్గించు సంస్కారముల ననుసరించి యుండును.

(c) విజ్ఞాన భూమికలో సత్యస్థితిలో జరుగు ఫనా–బకా.

617. ప్రతి భూమికయు దాని ఫనా – బకా లను కలిగియే యుండును.

618. సర్వ సాధారణముగా ఫనా – బకా స్థితులన్నియు ఒకే మాదిరిగా నున్నను, ఒక భూమికలోని 'ఫనా – బకా' కును మరియొక భూమికలోని 'ఫనా – బకా' కును వాటి వాటి సంస్కారముల ననుసరించి అనుభవములో భేదముండును.

---

Notes:— ఫనా = నిర్వాణస్థితి (సుషుప్తి అవస్థ)
బకా = ఆత్మ ప్రతిష్ఠాపనము (జాగ్రదవస్థ)

ఉదాహరణము:- అమెరికా నివాసియు, ఆసియా నివాసియు ఒకే భూమిమీద నివసించుచున్నను ఎవరి సంస్కారములు వారివి. ఆసంస్కారములకు తగిన తమ వ్యష్టిజీవితముయొక్క సంబంధ అనుభవములు, తాము నివసించు ఖండములకు సంబంధించియుండును.

**619.** సృష్టిలోని ప్రతి ప్రాణి ఘనా-బకా లను కలిగియున్నట్లే భూమికలలో నున్నవారుకూడా ఘనా-బకా లను కలిగి యుందురు. కాని వాటి వాటి సంస్కారములను బట్టి అవి భేదాలు కలిగి యుండును.

ఉదాహరణము :- హంస తూలికా తల్పమున పరుండినవాడును, రాతిబండపై పరుండినవాడైనను లేక ఇద్దరును కలిసి ఒకేపరుపుపై పరుండినను ఇద్దరికీ సుషుప్తి - జాగృతులున్నప్పటికీ ఎవరి ఘనా-బకా లు వారివి.

**620.** సలిక్ :-

బ్రహ్మీభూతుడైన తరువాత, సచ్చిదానంద స్థితి ననుభవించుచు, భూమిమీద భగవంతుని దివ్య జీవనము గడుపుటకై సామాన్యమానవుని చైతన్యమునకు క్రిందికి దిగివచ్చి, దానితోపాటు భగవంతుని

దివ్య జీవితములో స్థిరపడిన వానిని నిజమైన సలీక్ అందురు.

621: హకీకత్–ఏ–ముహమ్మదీ :– దేహధారులైయున్నస్థితి ముకామ్ – ఏ–ముహమ్మదీ :– సద్గురువుల యొక్క లేక, అవతార పురుషుని యొక్క దివ్య కార్యాలయము.

622. నిజమైన 'సలీక్' సృష్టిలో నివసించునపుడు, భగవంతుని, సత్యముగను, ప్రపంచమును మిథ్యగను తెలిసికొనును. (బ్రహ్మసత్యమ్ జగన్మిథ్య).

623. 'సలీక్' యొక్క చైతన్యమును సులూకియత్ అందురు.

624. సులూకియత్ అనగా అనంతదివ్య జ్ఞానము యొక్క విజ్ఞాన స్థితి.

625. మానవునిలో నెలకొనిన భగవంతుని జీవితములో, ఆ మానవుడు భగవంతునిగా సహజసమాధి యొక్క అనుభవమును పొందును. ఏ కొంచెము ప్రయాసయు లేకుండా ఏళ కాలమందే నిరంతరాయముగా సహజముగా అటు భగవంతుని అనంతజ్ఞాన, శక్తి, ఆనందము

లను ఇటు మానవజాతియొక్క బలహీనతలను, బాధ
లను, అనుభవించును. ఇవి - తన అనంతసర్వము
నుండి పుట్టిన అభావజన్యములే యనియు, ఈ యను
భవము మిథ్యానుభవమే ననియు ఎఱుంగును.

626. ఏకకాలమందే అటు భగవంతునిగను ఇటు మానవుని
గను అనుభవించు స్థితియే పూరస్థితి.

627. ఆత్మ ప్రతిష్ఠాపన స్థితిలో (సులూకేయత్) పూర్ణత్వము
మూడు విధములుగా నుండును.

1. కామిల్ = పరిపూర్ణ మానవుడు
2. అక్మల్ - పరిపూర్ణ మానవ శ్రేష్ఠుడు
3. ముకమ్మిల్ = పరమ పరిపూర్ణుడు.

628. కామిల్, అప్పటికప్పుడు ఒకనికి మాత్రము తా ననుభ
వించు చున్న ఎఱుకతో కూడిన భగవదనుభూతినివ్వ
గలడు.

629. అక్మల్, అనేకమందిని తనంతవారిని చేయగలడు.

630. ముకమ్మిల్, ఎందరికైన నేమి, సమస్త సృష్టికే తన
అనుభవము నివ్వగలడు.

631. ఆత్మ ప్రతిష్ఠాపనముతో భగవంతుని రెండవ దివ్య
యానము అంత్యమగును.

632. సలీక్, తా ననుభవించు అనంతశక్తులను సద్గుణములవలె
అన్యులకై వినియోగించడు.

# మూడవ దివ్యయానము

## సద్గురువు :-

633. ఆత్మ ప్రతిష్ఠాపన స్థితి (బకా - బీ-అల్లాహ్) దాటిన తరువాత కుతుబీయత్ స్థితిలో భగవంతుని జీవితమును గడపును. ఇట్టివారే - కుతుబ్ లు లేక, సద్గురువులు లేక పరమ గురువులు.

634. సద్గురువనగా మానవుడు భగవంతుడయ్యె ననుట.

635. సద్గురువులు, సలీక్. వలెనే, ఏకకాలమందే అటు భగవంతుని అనంత సచ్చిదానందస్థితిని ఇటు మానవుని సాధారణ చైతన్యస్థితిని ఎఱుకతో అనుభవించుటయే గాక, తన అనంతశక్తులను మాయాబద్ధులైనవారి విమోచనమునకై వినియోగింతురు. పరమాత్మలో C సగుణసాకారస్థితి.

636. సద్గురువు, మొట్టమొదట భగవంతుడై, భగవంతునిలో నివాస మేర్పరచుకొని, భగవంతుని జీవితమును గడుపుచూ సృష్టిలో దైవప్రతినిధిగా నుండును.

637. 'బకాబిల్లాహ్' స్థితిలో, భగవంతుడు మానవరూపములో భగవంతునిగా తన దైవత్వమును, ఇటు మానవునిగా మానవత్వమును ఉభయ స్థితులను అనుభవించు చుండును.

638. మూడవ దివ్యయానము చివరిలో సద్గురువు ద్వంద్వ పాత్రలలో జీవించుటయేగాక, ఏక కాలమందే, తన అనంత జ్ఞాన-శక్తి - ఆనందముల ద్వారా బలమును, అజ్ఞానులైన మానవులద్వారా బలహీనతలను - బాధలను ప్రదర్శించును. తన అనంత స్వభావత్రయమును అన్యులకై వినియోగించును.

639. అతడే మానవుడు అతడే భగవంతుడైన సద్గురువు సర్వస్వతంత్రమైన సత్యమును సృష్టి (ప్రకృతి) లోనికిదింపి పరమాత్మ స్థితిలోనున్న C దివ్యకార్యాలయము నుండి సృష్టిని పాలించును.

640. సద్గురువు ఏకకాలమందే అఖిలవిశ్వములలో, సమస్త లోకములలో, భూమికలన్నింటిలో, అన్ని స్థాయిలలో అందరియొక్క అన్నింటియొక్క జీవితములను గడుపుచుండును.

641. శివాత్మలలో బహుకొలదిమంది మిక్కిలి అరుదుగా ఏ ఒక్కరో మానవరూపములో భగవంతుని జీవితమును ఎఱుకతో గడుపుచు సర్వోన్నత దివ్యావస్థానమును అలంకరింతురు.

642. సత్యస్థితియొక్క అనుభవములో బ్రహ్మీభూతులను, జీవన్ముక్తులను (పరమ హంసలను) సలిక్‌లను, సద్గురువులను కించిత్తయినను భేదములేదు.

Notes :— 1. బ్రహ్మీభూతుడు 2. జీవన్ముక్తుడు 3 సలిక్ 4. సద్గురువు.

643. సద్గురువులు అనంతజ్ఞాన స్థితిలో తమకు తామై నెలకొని అనంతానందము ననుభవించుచు తమ అనంతశక్తిని (అధికారమును) ప్రయోగించుటకు తమ అనంత జ్ఞానమును వినియోగించుటలోనే తగ తమ భేదములున్నవి గాని, సచ్చిదానందస్థితి అనుభవములో పై వల్వురును సమానులే.

644. అన్ని యుగములలో, అన్ని కాలములలో ఈ భూమి మీద 56 గురు శివాత్మలు (బ్రహ్మీభూతులు) ఉందురు. ఈ యేబది ఆరుగురిలో చాలహెచ్చుమంది బ్రహ్మీభూతస్థితిలో నుందురు. కొలదిమంది 'దివ్య కూడలి' యైన 'తురీయావస్థ'లో నుందురు. బహు కొలదిమంది తురీయావస్థను దాటి ఆత్మ ప్రతిష్ఠాపన స్థితిలో నుందురు 5 గురు మాత్రము మానవ రూపములో మానవులమధ్య భగవజ్జీవితమును గడుపు చుందురు. వీరే సద్గురువులు.

645. సద్గురువును ఆరాధించినచో, అనంతగుణ విశిష్టుడైన భగవంతుని ఆరాధించినట్లే.

646. మానవుడు దైవత్వ సిద్ధిని బడయుటకును, అటు పిమ్మట సాధారణ చైతన్యమును తిరిగి పొంది సద్గురువగుటకును కూడా, సద్గురువు యొక్క సహాయమే అవసరము.

**647.** సద్గురువు జ్ఞానపూర్ణుడగుటచే, తానుసంకల్పించినచో ఎవరికైనను రెప్పపాటు కాలములో మోక్షమును ప్రసాదించగలడు.

**648.** నిస్సంగను నుండి నిస్సంగమును పొందినవాడు పరిపూర్ణుడగును.

**649.** సద్గురువు ఆరోగ్యముగా గాని, లేక అనారోగ్యముగా నున్నట్లు గాని సామాన్య మానవునకు కన్పించును. కాని నిజముగా సద్గురువు ద్వంద్వాతీతుడు కాబట్టి ద్వంద్వములు ఆతని అనంతత్వమును స్పృశించ నేరవు. ద్వంద్వానుభవము లన్నియు మాయ యని సద్గురువునకు తెలియును.

సద్గురువును మిధ్య ఎన్నడును అంటదా ?

**650** సద్గురువు పరిణతి, పునరావృత్తి, ఆధ్యాత్మిక మార్గముల ద్వారా, అభావముయొక్క సంస్కారము లన్నింటిని జయించి, అభావమునుకూడా లోపల కలిగియున్న సర్వమ్ తానేయని అనుభూతి నొందెను. సద్గురువు సృష్టి ధర్మమందున్నను, అది వాని నంటదు.

**651.** మానవుడు భగవంతుడైన తరువాత ఇంక మానవుడుగా నుండ లేడు. ఆతడు మానవుని వలెనే జీవించవలెనన్నచో, అప్పటికప్పుడు అన్ని విధముల మానవ లక్షణములతో మానవునివలెనే వ్యవహరించును.

**652.** సద్గురువు పరిపూర్ణుడగుటచే, అన్ని పాత్రలను పరిపూర్ణముగా ప్రవర్తించగలడు. సామాన్యులకు ఒక సామాన్యునివలె కాన్పించును. యోగీశ్వరులకు యోగివలె, ఋషీశ్వరులకు ఋషీశ్వరునివలె కాన్పించును.

అన్ని భూమికలలో, అన్ని స్థాయిలలో అన్ని విధముల అన్నింటికి, అదే విధముగా కాన్పించును.

**653.** సద్గురువు ఏకకాలమందే ఉత్తమాధమ స్థితులయందుండును. ఒకవంక ఆతడు అనంతసత్యస్థితిలో ప్రతిష్ఠితుడయ్యెను, వేరొక వంక మాయకు ప్రభువై యున్నాడు. ఈరెండు ఎగుడు దిగుళ్ళను తాను ఏకకాలమందే అన్ని భూమికలలో, అన్ని స్థాయిలలో వ్యవహరించును. మధ్య స్థితులద్వారా వాటిని సమతుల్యముగా కాపాడుచున్నాడు.

**654.** సద్గురువును గుర్తించగల వారెవరు ?

నిష్కపటి, సహనశీలుడు అయిన సత్యాన్వేషకునకు సద్గురువు తటస్థించినప్పుడు, నిర్దిష్టమైన కొన్ని బాహ్య చిహ్నములను బట్టి గుర్తించగల్గును. అవి :-

(a) సద్గురువుయొక్క అంతరానుభవము స్వయముగా యాదృచ్ఛికము X అతి సహజముగా ప్రేమ రూపములో వ్యక్తమగు చుండును. ఆతడు కొందరిని చేరదీయుడు, మరికొందరిని తోసిపుచ్చాడు. ఆతనికి అందరు అన్నియు (ద్వంద్వములు) సమానమే; అవి

అన్నియు ఆతని ఆవిష్కారములే. మూర్తీభవించిన పూర్ణత్వము, ఏ సజీవప్రాణినైనను ప్రేమించినను, లాలించినను లేక ఆహారమిడినను తననుతానే ప్రేమించు చున్నట్లును, తనను తానే లాలించు చున్నట్లును లేక తనను తానే ఆహార మిడుచున్నట్లును అనుభూతి నొందుచు ఆనందించు చుండును.

(b) బ్రహ్మానంద భరితుడై, ప్రశాంతమూర్తియై కాన్పిం చును. అన్ని రకముల బాధలను ఆ మహా ప్రశాంతత లోనే అనుభవించు చుండును.

(c) అన్ని తరహాల మానవులలోను తాను ఒకనిగా కలసి మెలసి వ్యవహరించును.

655. సద్గురువు శిష్యునకు పరిపూర్ణతను ప్రసాదించవలె నన్నచో మెఱపుకాలము చాలును. చెవిలో ఒక్క మాటను చెప్పి, పరిమితుడై యున్నవానిని అనంతుని చేయును.

656. ఇట్టి మార్పు, ప్రార్థనలపై ఉపవాసములపై ఆధారపడి జరుగదు.

657. సద్గురువు బ్రహ్మానుభూతిని ఎవరికైనను ఒక సెకనులో ప్రసాదించగలడు.

658 సద్గురువు వలన సెకనులో పొందబడిన బ్రహ్మాను భూతి, తనకే ఉపకరించును గాని పరుల కుపయోగ పడదు.

659. సద్గురుసేవలో కష్టములకు ఓర్చుకొని ముక్యాకలు తీరిన తరువాత సద్గురువు వలన పొందిన బ్రహ్మాను భూతి ఇతరులను కూడా అట్టివారిని చేయుట కుపక రించును.

పరమ ముక్తి :

660. పరమ ముక్తిని సద్గురువనియు, కుతుబ్ అనియు పూర్ణ గురు వనియు అందురు.

సద్గురువు, తాను ముక్తుడైన పిమ్మట సాధారణ మైయున్న స్థితికి వెనుకకు మరలి వచ్చును. ఏక కాల ముందే "అహం బ్రహ్మాస్మి" (నేను భగవంతుడను) స్థితియందుడు ముల్లోకములందును ఎఱుక కలిగి యుండును ఆతడు సచ్చిదానంద స్థితిని అనుభవించు టయే గాక, వాటిని తన మహాకారణ శరీరముద్వారా వినియోగించును.

661. పరమముక్తుడు, వ్యక్త అవ్యక్త (సాకార నిరాకార) స్థితుల రెంటియందును తాను భగవంతుడనని ఎఱిగి యుండును.

తాను నిర్వికారమైన దివ్యస్వరూపుడననియు అనంతమైన వ్యక్త స్థితులన్నియు తానే ననియు తనకు తెలియును.

**662.** పరమముక్తుడు సృష్టికి పరుడనైన భగవంతుడ ననియు సృష్టి - స్థితి-లయకారుడైన భగవంతుడ (ఈశ్వరుడు) ననియు సృష్టి యొక్క పరిమితులను అతిశయించితి ననియు అనుభూతి నొందుచుండును.

అనగా -

భగవంతుని దశపాత్రలలో ప్రతిపాత్రయందు ఎఱుక కలిగి యుండును. సృష్టి యొక్క దివ్యలీలను పూర్తిగా ఆనందించును. బాధల ననుభవించును. ప్రతి వారిలో, ప్రతి దానిలోనున్న భగవంతుడు తానేనని తనకు తెలియును. కనుక ప్రతియొక్కరికి ఆధ్యాత్మికముగా సహాయముచేయ సమర్థుడగును. పై నాలుగు విధములలో ఏరకము ముక్తినైనను పొందునట్లు చేయును. ఆతడు నిజముగా ప్రత్యేకించి మానవజాతికిని సార్వజనీనముగా సృష్టికిని సహాయము చేయును.

**663.** పరమ ముక్తునకు సృష్టిలో కర్తవ్యము (అధికారము) ఉన్నది.

**664.** సద్గురువు = కుతుబ్ (పూర్ణగురువు)
= అనంత అస్తిత్వము + అనంతజ్ఞానము +
+ అనంత ఆనందము + చైతన్యము
= అనంతమందు, సాంతమందు ఏక
కాలమందే ఎఱుకతో నుండును.

665. సద్గురువు :- భగవంతుడు, మానవుని గా, తనను ప్రతి వారిలో ప్రతిదానిలో చూచును.

666. నిజమైన జ్ఞానము :- మారేఫత్ OF హకీకత్)
అటు భగవంతుని యొక్క ఇటు విశ్వముయొక్క సంపూర్ణ జ్ఞానము ఆధ్యాత్మిక పరిపూర్ణతను హస్తగతము చేసికొన్న సద్గురువుల యొక్క అవతారపురుషునియొక్క దివ్యజ్ఞానం (సత్యానుభూతి యొక్క దివ్యత్వము.)

667. ఒక మానవుని తనవలెనే పరిపూర్ణుని చేయుటయే సద్గురువు చేయు ఘనమైనలీల.

668. ఏకకాలమందే, ఆత్మ చైతన్యమును + సృష్టి చైతన్యమును కలవాడై, సచ్చిదానంద స్థితిని ఎఱుకతో అనుభవించుటయే గాక దానిని పరులకై వినియోగించును. ఇది సద్గురువు లేక, అవతారపురుషుని స్థితి.

లి ప్తకాలములో భౌతిక చైతన్యముగల సామాన్య మానవుని, ఆత్మచైతన్యముగల భగవంతుని చేయగల సర్వ సమర్థుడగును.

669. ప్రతియుగమందును ఎల్లకాలమందును ఉన్నట్టి పంచ సద్గురువులు అఖిల విశ్వమును పాలింతురు.

## అవతార పురుషుడు లేని కాలము

670. అవతారయుగము కానికాలమందు ఈ పంచ సద్గురువులు లోక వ్యవహారములను (విశ్వపరిస్థితులను) సమిష్టిగా చూచుచుందురు. వారిలో ఒకరు మాత్రము సమస్త పరిస్థితులను అదుపునందుంచుట యందును, పాలించుట యందును బాధ్యుడై యుండును. వీనిని కుతుబ్ - ఏ - ఇర్షాద్ అందురు.

671. దివ్యశాసనము ప్రకారము ఎల్లకాలమందును ఆ యుగాంత్యమందు భగవంతుడు మానవరూపములో పురుషునిగా ఈ భూమిపై అవతరించుటకు ఐదుగురు సద్గురువులు కారణ భూతులగుదురు.

అవతారము :—

672. పరమాత్మ (B) స్థితిలోనున్న అనంతచైతన్యమే, సరాసరి మాయాసృష్టిలో, మానవరూపములో అభివ్యక్తమగును. ఇతడే సర్వోన్నతుడైన పురాణ పురుషుడు, అవతారపురుషుడు (సర్వాతిశాయి), స్వాతంత్రి సత్యము.

Notes :—అవతారము, మోచకుడు, ప్రవక్త, రక్షకుడు, రసూల్, క్రీస్తు, మొహామ్మద్, బుద్ధ (అవతార పురుషుని, భిన్నమతములలో ఇట్లు పేర్వేరుగా పిలుతురు.

# నాల్గవ దివ్య యానము.

## మహాభినిష్క్రమణము

## లేక,

## సద్గురు నిర్యాణము.

**673.** సద్గురువు భగవంతునిగా దేహమును చాలించుచు నాల్గవ దివ్యయానమునకు సంబంధించి యుండును.

**674.** సద్గురువు దేహము చాలించిన తరువాతకూడా ఆతని ఎఱుక గల్గిన అనంత, అఖండ వ్యక్తిత్వ అనుభవమైన "అహం బ్రహ్మాస్మి" స్థితి శాశ్వతముగా పరమాత్మ (B) స్థితిలో నిలిచి యుండును.

### అవతారపురుషుడు

675. సద్గురువు దేహము చాలించిన తరువాత మరల జన్మిం చడు. కాని ఒక్క అవతారపురుషుడు మాత్రమే మరల మరల జన్మించుచుండును.

676. భగవంతుడు మానవుడగుటయే అవతారము అని యర్థము. మానవులలో మానవుడగుటయేగాక పిచ్చుక లలో పిచ్చుక, చీమలలో చీమ, సూకరములలో సూకరము, ధూళిలో ఒక కణము. ఇట్లు సృష్టిలో ప్రతిదియును తానే యగుచున్నాడు.

677. భగవంతుడు మానవరూపములో పురుషునిగా సాక్షాత్కరించినప్పుడు, ఆతని దివ్యత్వమును మానవ జాతికి బహిర్గత పరచును. ఆతడు అవతారముగా పరిగణింప బడును.

678. సద్గురువువలె పరిణామ ప్రక్రియ, పునర్జన్మ ప్రక్రియ, ఆధ్యాత్మిక మార్గములనెడి క్రమములను దాటకనే, సరాసరి మానవ రూపముగా భూమిపై దిగుటయే అవతారము అనియందురు.

679. అవతార పురుషుడు :-

భగవంతుడు, భగవంతునిగను మానవునిగను తనను ఏకకాలమందే ప్రతి వారిలో ప్రతి దానిలో చూచును.

680. భగవంతుడు సరాసరి మానవుడై మానవులమధ్య మానవ జీవితమును గడుపుచూ యీ అయిదుగురు సద్గురువుల ద్వారా సర్వోన్నతునిగా లేక, పురాణ పురుషునిగా తన దివ్యస్థాయిని అనుభూతి నొందును.

681. పారమార్థికముగా సర్వమూ భగవంతుడే అతడు ప్రతి దానిలో ప్రతివారిలో ఉన్నాడు. అవతారుడైన భగవంతుడు సర్వమూ తానేగాక, ప్రతిదానిలో ప్రతి వారిలో ఉంటుటయేగాక, నిజముగా పతితుడైన ప్రతి మానవుడు తానే 'అగు' చున్నాడు ([illegible] డగును,

అవతారయుగము :—

682. అవతారయుగమందు సత్యస్థితిలో పరమాత్మ B స్థితి యందున్న అనంత చైతన్యము సృష్టిలో సరాసరి భూమిమీద మానవునిగా పురుష రూపములో ప్రత్యక్ష మగుచున్నది. భగవంతుడు యీ విధముగా సరాసరి భూమికి దిగుటను సామాన్యముగా అవతరించుట యందురు. ఇట్లు అవతరించిన భగవంతుడే అవతార పురుషుడు.

683. అవతార యుగము 700 సం॥ నుండి 1400 సం॥ వరకు ఉండును. అవతార యుగములో పదునొకండు కాలము లుండును. ప్రతి కాలమందును ఐదుగురు సద్గురువు లుందురు. అవతారయుగాంత్యమున అనగా – పదు నొకటవ కాలమందు అవతార పురుషుడుండును.

684. పదునొకటవ కాలమందలి సద్గురువులైదుగురు దివ్యత్వ మును మానవ రూపములో అవతార పురుషునిగా భూమికి దింపెదరు. వారి ప్రమేయము లేనిచో, భగ వంతుడెన్నడును అవతరించడు.

# అవతార యుగము




685. అవతార పురుషుడు 56 బ్రహ్మీభూతులలో ఒకడు మాత్రము కాదు. 56 గురికంటె అదనము.

686. అవతార యుగమందు అప్పుడు, సజీవులై యున్న సద్గురువు లేవురిలో కుతుబ్ - ఏ - ఇర్షాద్ పూర్తి బాధ్యతగల సద్గురువు. తన ఉద్యోగ ధర్మమును కార్య

భారమును విశ్వవ్యవహారముల నిర్వహించు సంపూర్ణ బాధ్యతను అవతార పురుషునికి అప్పగించి తాను వైదొలగి, తాను బ్రదికి యున్నంత కాలము తక్కిన నల్వురు సద్గురువులవలెనే సద్గురు కార్యాలయమును నిర్వహించును.

ఒకే ఒక అవతారము :-

687. ఎల్లకాలములందు అదే అవతారము లేక, ఒకే అవతారము (ఏకైక అవతారము) ఉండును. ఎందుచేతననగా శాశ్వతుడు అవిభాజ్యుడు అనంతుడు అద్వయుడు అయిన భగవంతుడు స్వయముగా మానవ రూపములో పురుషునిగా, భూలోకములో జన్మించి నప్పుడు అతనిని అవతారమనియు, మెస్సైయ, క్రవక్త, బుద్ధ, రసూల్, సాహెంబ్-ఏ-జమానా, మొహమ్మద్ అనియు సర్వోన్నతుడైన పురాణ పురుషుడనియు అందురు.

ఒకే ఒక అవతారము :—

688. భగవంతుడెల్లప్పుడును శాశ్వతుడు, అవిభాజ్యుడు, అనంతుడుగా ఒకడే అయియుండుట వలన అవతార పురుషుడుకూడ ఒకడే, అయియున్నాడు.

ఆతడు మానవరూపములో అవతారముగా, మెస్సియగా, ప్రవక్తగా, బుద్ధునిగా, సర్వోన్నతుడై పురాణ పురుషునిగా తనకు తానై (స్వయంభువు) అభివ్యక్తుడగు చున్నాడు. శాశ్వతుడైన ఈ యేకైక అవతారమే, వేర్వేరు యుగములలో, వేర్వేరు నామములతో, వేర్వేరు మానవరూపములలో, వేర్వేరు ప్రదేశములలో వేర్వేరు భాషా స్వరూపములలో సత్యమును బహిర్గత పరచుటకును, అజ్ఞానాగ్రముమునందున్న మానవజాతిని సముద్ధరించుటకును, భ్రాంతి మయ బాధములనుండి విముక్తిగావించుటకును కాలాంతరము లందు పునరభివ్యక్తుడగు చున్నాడు.

689. సద్గురుడు = పూర్ణమానవుడు = ఇన్సాన్-ఏ-కామిల్ (మానవ పరిపూర్ణుడు)
= సాహెబ్-ఏ-జమాన్ = రసూల్ = అవతార్ = సజీవక్రీస్తు
= అనంత అస్తిత్వము + అనంతజ్ఞానము + అనంతానందము + చైతన్యము
= అనంతమందు, సాంతమందు ఏకకాలమందే ఎఱుకతో నుండుట.

690. అవతారపురుషుడు భూలోకములో ఉన్నప్పుడుకూడా, 56 గురు బ్రహ్మీభూతులు దేహధారులై యుందురు. వీరు 56 గురు 56 కార్యాలయములను నిర్వహింతురు,

కాని ఒక్క అవతారపురుషుడు మాత్రమే సర్వాధి
కారియై యుండును.

691. అవతార పురుషుడే భగవంతుడు. భగవంతుడే, మానవకోటికి మానవుడై, జంతుశ్రేణికి జంతువై, పక్షిజాతికి పక్షియై ఇట్లు సృష్టిలో సర్వమూ తానే "అగు" చున్నాడు. అనగా :-

సృష్టియే తానగు చున్నాడు (విశ్వరూపుడు) ఇదియే అవతారమనగా సరియగు అర్థము.

692. పంచ సద్గురువులు భగవంతుని దివ్యత్వమును మాయా సృష్టికి బహూకరించినప్పుడు, ఈ దివ్యత్వము సృష్టి అంతటా అలముకొని, స్ఫురించి, అసంఖ్యాకరకముల సూక్ష్మ - మానసిక రూపములలో కనిపించును.

693. నిజమగు అవతారతత్వమును సామాన్యుడు ఆకళింపు చేసికొనలేక, భగవంతుడు మానవుడయ్యెనని గ్రహించి అంతటితో తృప్తి జెంది ఊరకుండును.

694. అవతార పురుషుడు అదియే అయిపోవును.

ఉదా:—"ఎవ్వనిచే జనించు........

సర్వము తానయైనవాడెవ్వడు"........

సద్గురువు అదిగానే వ్యవహరించును.

అవతార పురుషుడు తానే ప్రపంచమై పోవును.

---

Notes:— సద్గురువు సమస్తమును తానై వ్యవహరించును, తానై ప్రవర్తించును. అవతారము సర్వమును తానే యగును. (విశ్వరూపుడగును)

695. అవతార పురుషు డెన్నడును వ్యక్తుల కర్మను తీసి వేయడు, కాని ఆతని దైవత్వము విశ్వాత్మకముగా పని చేయును.

696. అవతారపురుషుడు మానవునివలెనేఅస్వస్థతగానున్నచో ఏక కాలముందే ఆతని వెనుక ఆతనికి అనంతశక్తియు- అనంత జ్ఞానమును - అనంత ఆనందమును కలిగి యున్నాడు.

697. ముక్తి పొందిన తొలి ప్రత్యగాత్మయే అవతార పురుషుడా?

భగవంతుడు తొలిసారిగా పరమాత్మయొక్క (B) స్థితిలో చైతన్యవంతుడయ్యెను. అనగా - భగవంతుడు, తానుండుట అనను తాను తెలిసికొనెను. ఏక కాలముందే పరమాత్మయొక్క (A) స్థితిలో అనంతముగా చైతన్య పొందు స్పృహలేక యుండెను. భగవంతుని తక్కిన ఇతర స్థితులును, దివ్య అంతస్థులును యీ (A) స్థితి యొక్క ఫలితములే. (A) స్థితి శాశ్వతముగా అనంత చైతన్యమును పొందుటకు జిజ్ఞాసతో నుండును.

ఏతత్ఫలితముగా మానవుడు భగవంతుడై నట్లు మనము కనుగొను చున్నాము.

698. సత్యమేమనగా – అవతారపురుషుడు సదా ఒక్కడే, అతడే. ఆ కాలపు పంచసద్గురువులే భగవంతుని భూలోకమునకు దింపెదరు. ఈ విధానము ఇంతకు పూర్వము ఇంకముందును శాశ్వతముగా ఇట్లే జరిగి పోవుచుండును.

భగవత్కార్యాలయము :-

699. ఈ కార్యాలయమునుండి ఒక్క అవతార పురుషుడు మాత్రమే స్వయం ప్రకటితుడై తాను, రక్షకుడననియు ప్రవక్తననియు, మోచకుడననియు, దేవుని కుమారుడ ననియు, అవతారము ననియు, రసూల్ ననియు, బుద్ధ ననియు ఎలుగెత్తి తనను తాను ప్రకటించుకొనును.

700. అవతార పురుషుడు అనంతమగు దివ్య చైతన్యమును, అపరిమితమగు ఈశ్వరీయ అహమును (నేను భగ వంతుడను) సార్వభౌమిక మనస్సును, విశ్వమయ దేహ మును స్థూల – సూక్ష్మ – కారణ దేహములను కలిగి యుండును. (సప్త ఉపాధులు)

Notes :— పందొమ్మిదవ (1894) శతాబ్దములో భగవంతుని "మెహెర్ బాబా" స్వరూపములో భూమికి దింపిన పంచ సద్గురువులు :-

1. హజ్రత్ తాజుద్దీన్ బాబా ; 4. నారాయణ మహారాజ్
2. హజరత్ సాయి బాబా 5. హజ్రత్ బాబాజాన్.
3. ఉపాసనీ మహారాజ్

సద్గురువు –
అవతార పురుషుడు.

701. భగవంతుని జీవితమును సాగించుటలో సద్గురువును, అవతారపురుషుడును సమానులే.

702. సద్గురువును అవతారపురుషుడును ఏక కాలమందే మిథ్యాభూమిక లన్నింటి యందును విహరింతురు.

703. సద్గురువును అవతార పురుషుడును ఏక కాలమందే ఉత్తమాధమ స్థితులయందుందురు.

704. సద్గురువునకును అవతారపురుషునకును గల ముఖ్య భేదమేమనగా_సద్గురువు ఆస్థాయిలందు ప్రవర్తించును అవతార పురుషుడు ఆయాస్థితుల యందుండుటయే గాక, తాను అదే అయిపోవును.

ఉదా:_ సద్గురువు రోగి కాలేడు, కాడు. కాని అతడు రోగిగా కాన్పించినచో, అతడప్పుడు రోగి వలెనే ప్రవర్తించును.

705. సద్గురువు అన్ని వస్తువులయందు, అన్ని ప్రాణుల యందు, అందరి మానవులయందు అన్ని స్థాయిలందు తానున్నట్లు ప్రవర్తించును.

706. అవతార పురుషుడట్లుగాక తాను ఏక కాలమందే, అన్ని పరిస్థితులలోను అన్నిస్థాయిలందును అన్ని భూమి కలలోను అదే వస్తువుగను అదే ప్రాణిగను అదే మానవునిగను అయి యుండును (విశ్వరూపుడగును – విశ్వమే తానయిపోవును.)

707 అవతార మహిమ :-

ఒక్క అవతారపురుషుడు మాత్రమే సృష్టియందలి అన్ని వస్తువులకు, అన్ని ప్రాణులకు, అందలి మానవులకు ఏకకాలమందే విశ్వాత్మక మరు ఆధ్యాత్మిక ఆఘాతము నిచ్చుటలో అనంత సమర్థుడు

మానవులలో తానొకమానవుడై, మానవులందరికిని భౌతికముగను- ఆధ్యాత్మికముగను అన్నిపరిస్థితులందును పరోక్షముగా సహాయపడు చుండను.

ఆధ్యాత్మిక అధికార పీఠము

708. ప్రతి అవతారయుగ కాలప్రమాణము 700 సం|| నుండి 1400 సం||తో అంత్యమగును.

709. ప్రతి అవతారయుగములో పదునొకండు కాలము లుండును.

710. ఒక్కొక్క కాలప్రమాణము 65 సం|| నుండి 125 సం||లతో అంత్యమగును.

711. ప్రతి కాలమందును 5 గురు సద్గురువు లుండురు.

712. ప్రతి అవతార యుగాంత్యమందును పదునొకండవ కాలములో అవతార పురుషు డుండును.

713. ఐదుగురు సద్గురువులు + ఒక అవతార పురుషుడే గాక ప్రతి యుగమందును 56 బ్రహ్మీభూతు లుందురు. వీరు సృష్టిలీలయిందు కర్తవ్యము లేనివారైయుందురు.

## కాలములు సద్గురువులు బ్రహ్మీభూతులు

1 — 5 — 7 ముక్తిపొందగనే వీరిలో 4 గురు వెంటనే దేహములు చాలింతురు.

2 — 5 — 3

3 — 5 — 7 (ఒకటవ కాలములో వలెనే)

4 — 5 — 3

5 — 5 — 7 (మూడవ కాలములో వలెనే)

6 — 5 — 3

7 — 5 — 7 (ఐదవ కాలములో వలెనే)

8 — 5 — 3

9 — 5 — 7 (ఏడవ కాలములో వలెనే)

10 — 5 — 3

11 — 5 — 6 (తొమ్మిదవ కాలములో వలెనే)

అవతార్ 1

56 56

714. "కాలము" యొక్క ప్రమాణము 65 సం॥ 125 సం॥ ఆ కాలపు భౌతిక, ఆధ్యాత్మిక విశ్వ పరిస్థితుల ననుసరించి యుండును.

715. ప్రతి కాలమందును 3 గురు బ్రహ్మీభూతులు మాత్రమే దేహధారులై నిలిచి యుందురు. వారే, ఉద్యోగ ధర్మములను నిర్వహింతురు.

716. ఎల్ల కాలములలో ప్రతి అవతారయుగమందును భూమిమీద మానవరూపములో 56 గురు బ్రహ్మీ

భూతులుందురు వీరిలో 8 గురు ప్రజా బాహుళ్యము నకు తెలిసి యుందురు. ఆధ్యాత్మిక అధికారపీఠములో కార్యనిర్వాహక సభ్యులై కార్యధక్షులై పని చేయుచుం దురు అధికార పీఠము 7000 మంది సభ్యులతో కూడి యుండును. వీరు వారివారి ఆధ్యాత్మిక సత్తాను, స్థాయిని అనుసరించి భూమికలలో వారికి నియోగింపబడిన ఉద్యోగ ధర్మములను నిర్వహించు చుందురు.

717. మిగిలిన 48 గురు బ్రహ్మీభూతులు 7000 లలోవారు కాదు. ఈ 48 గురు దూరముగా అజ్ఞాతముగానుందురు. వీరి దివ్యత్వముపట్ల ప్రజలు అజ్ఞులై యుందురు. వీరం దరు తక్కిన 8 గురు వలె "అహం బ్రహ్మాస్మి" దివ్య స్థితిని అనుభవించు చుందురు. ఈ 48 గురు సమయ నిరీక్షణ జాబితాలో నుందురు.

ఉద్యోగమును నిర్వహించు 8 గురిలో ఒకరు గాని ఇద్దరు గాని మరణించినచో, వారి స్థానములో వీరు ప్రవేశించుటకు సంసిద్ధులై యుందురు.

7000 మంది సభ్యులు గల మహీ పీఠములో ఈ 8 గురును ఉన్నతపదవి యందుందురు. 8 గురిలో 5 గురు సద్గురువులు. ఈ పంచ సద్గురువులు యావత్తు మానవ జాతియొక్క ఆధ్యాత్మిక విమోచనమునకై పాటుపడు చుందురు. మిగిలిన ముగ్గురును బ్రహ్మీభూతులు, వీరు దేహధారులై యున్నప్పటికీ వారికి మానవులపట్ల

ఆధ్యాత్మిక కర్తవ్యము లేదు. అయినప్పటికీ వారిని దరి జేరిన వారికి వీరు ఆధ్యాత్మిక ప్రయోజనమును కలిగించు మూలస్థానమై యుందురు.

718. ప్రతి యుగమందును పదునాలుగవ కాలములో వచ్చు అవతారముతో కలిసి 700 మంది సంఖ్య.

"అహమ్ బ్రహ్మాస్మి"

719. "అహమ్ బ్రహ్మాస్మి" జ్ఞానము, బ్రహ్మీభూతునకు, జీవన్ముక్తునకు, సద్గురువునకు, అవతారపురుషునకు తరహాలుగా నుండును.

1. బ్రహ్మీభూతుడు :– అనంతముగా "నేను భగవంతుడను" అని యుండును.

2. జీవన్ముక్తుడు :– "సమస్తము నాతోనున్నది"

3. సద్గురువు :– "సమస్తము నాది"
"సమస్తము నాలో ఉన్నది"
"సమస్తము నానుండిఉన్నది"

4. అవతారము :– "నేను భగవంతుడను"
సర్వము "నేనే"
"నేను సమస్తమందున్నాను"
"సమస్తము నాలో ఉన్నది,
నానుండి వచ్చుచున్నది"

| 720. కోశములు | అనుబంధ లోకములు | లోకానుభవము కలవారు |
|---|---|---|
| 1. అన్నమయ కోశము | భౌతిక ప్రపంచము | సామాన్య మానవులు |
| 2. ప్రాణమయ | సూక్ష్మ ప్ర | యోగులు |
| 3. మనోమయ | మానసిక ప్ర | మహాపురుషులు<br>సత్పురుషులు |
| 4. ఆనందమయ | సత్యలోకము | బ్రహ్మభూతులు<br>జీవన్ముక్తులు |
| 5. విజ్ఞానమయ | | సలిక్‌లు<br>సద్గురువులు<br>అవతార పురుషుడు |

## భగవత్సిద్ధి.

721. "అహమ్ బ్రహ్మాస్మి" జ్ఞానము, ముక్తయోగుల పరిపూర్ణులకు సమానమే. ఈ జ్ఞానము భౌతిక మరణముతో అంతము కాదు.

| సంస్కారము | చైతన్యము | తాదాత్మ్యత | లోకముల అనుభవము | | | | అనుభవజ్ఞులు |
|---|---|---|---|---|---|---|---|
| | | | భౌతిక ప్రపంచము | సూక్ష్మ ప్రపంచము | మనోమయ ప్రపంచము | సత్య లోకము | |
| భౌతిక సంస్కారములు | అన్నమయ దేహ చైతన్యం | నేను దేహమును | ఉన్నది | లేదు | లేదు | లేదు | సామాన్య ప్రజానీకము |
| సూక్ష్మ సంస్కారములు | ప్రాణమయ దేహ చైతన్యము | నేను ప్రాణమును | లేదు | ఉన్నది | లేదు | లేదు | జిజ్ఞాసువులు సాధకులు అన్వేషకులు యోగులు |
| మానసిక సంస్కారములు | మానసిక దేహ చైతన్యం | నేను మనస్సును | లేదు | లేదు | ఉన్నది | లేదు | మహా పురుషులు సత్పురుషులు |
| సంస్కారములు లేవు | ఆత్మ చైతన్యం | నేను భగవంతుడను | లేదు | లేదు | లేదు | ఉన్నది | బ్రహ్మీభూతులు జీవన్ముక్తులు సద్గురువు అవతారము |
| యోగాయోగ సంస్కారములు | క్రీస్తు చైతన్యము | సర్వమూ నేనే | ఉన్నది | ఉన్నది | ఉన్నది | ఉన్నది | సద్గురువు అవతారము |

## మహిమా ప్రదర్శనములు.

వివిధములైన
సిద్ధులు, లేక చమత్కారములు

728. 1. అవతారపురుషుడు చేయు మహిమలు
2. సద్గురువు చేయు మహిమలు
3. మహాపురుషుడు (5 భూమిక) సత్పురుషుడు (6 భూమిక) చేయు మహిమలు.
4. 1, 2, 3, 4 భూమికలలో నుండు యోగులు చేయు మహిమలు.

1. సార్వజనీనముగా అవసరమైనప్పుడు, అవతార పురుషుడు విశ్వాత్మక లక్షణముతో మహిమలు చేయును. పరిస్థితుల ననుసరించి, అవతార పురుషుడు అంతవరకు 6, 5 లేక 4 భూమికలలో నుండును ఆ మహిమలు చాల ఉధృతముగ నున్నప్పుడు అంతవరకు 4 వ భూమికలో నుండును.

2 సద్గురువు కూడా మానవుల ఆధ్యాత్మిక శ్రేయస్సుకై మహిమలు చేయును. కాని అవతారపురుషుడు చేసినట్లు, విశ్వమంతటికి సంబంధించి యుండవు. అవసర పరిస్థితులను బట్టి, అవతార పురుషునివలెనే, అంతవరకు 6, 5, 4 భూమికలలో నుండును. 7 వ భూమికలో, బ్రహ్మీభూతుడు మహిమలు చేయుడు ఎందుచేత ననగా – ఆతనికి యీ సృష్టిలేదు. కాబట్టి.

## ఎఱుకతోడను ఎఱుకలేకను

## జరిగెడు మహిమలు

724. అవతారపురుషుని వలన, సద్గురువులవలన జరిగెడు మహిమలు 2 రకములు.

1. ఐచ్ఛికముగా చేయు మహిమలు 2. తాము చేయవలెనని, తెలిసియుండి చేయు మహిమలు.

725. 1. తమ దివ్యసంకల్పము యొక్క తీవ్రత ననుసరించి బాహ్యముగా చేయు మహిమలు.

2. అనైచ్ఛికముగా జరుగు మహిమలు. తమకు తెలియకనే జరుగుచుండెడి మహిమలు తమ పరిసరములలో ఎప్పుడునూ క్రియాత్మకమగు శక్తితో కూడిన వాతావరణము చుట్టియుండును. మహిమలు జరుగుటకు తాము మూలకారకులు కాబట్టి, అనైచ్ఛికముగా జరుగుచుండు మహిమలు వారికి తెలియకనే జరుగుచుండును.

3. ప్రపంచముయొక్క ఆధ్యాత్మిక జాగృతి కొరకే, సద్గురువుల మూలముగా ఎల్లప్పుడును ఐచ్ఛికముగను అనైచ్ఛికముగను (ఎఱుకగను ఎఱుకలేకను) మహిమలు జరుగు చుండును.

726. అవతార పురుషుడు

సద్గురువు

ఎందుకు

మహిమలు ప్రదర్శింతురు ?

ఆధ్యాత్మిక విలువల యందు తమకుగల సంపూర్ణ జ్ఞానము వలన, ప్రజలకు హాని జరుగకుండ వారిని రక్షించుటకై మహిమలను ప్రదర్శింతురు.

727. సద్గురువులు ఉన్నవి ఉన్నట్లుగనే కన్పించునట్లు చేయుచూ, ఇదివరకే యున్న మాయా తెరను చీల్చివైచి సత్యమును చూపింతురు. సృష్టి, భావనా మాత్రమే యనియు గ్రహింప జేయుదురు.

728 సద్గురువుల శక్తులు స్వయంశక్తులు. ఎందుచేత? తామే అనంతశక్తి స్వరూపులుగనుక. యోగులు అట్లుగాక, శక్తులను అప్పుగొని వాటిద్వారా మహిమలు చేయుదురు.

729. తురీయ అవస్థయందున్న జీవన్ముక్తునకు అధికారము లేదు. కాబట్టి మహిమలు ప్రదర్శించడు. కాని ఆతనికి తెలియకనే ఆతనిద్వారా మహిమలు జరుగు అవకాశము లేకపోలేదు.

అవతారపురుషుడు
సద్గురువు
చేయు మహిమలు

730. భగవంతునితో అవతార పురుషునకు గల సంబంధము ఐచ్ఛిక సాన్నిహిత్యము.

731. భగవంతునితో సద్గురువునకు గల సంబంధము అనైచ్ఛిక సాన్నిహిత్యము.

732. అవతార పురుషుడు మహిమలు చేయుటలో:– భగవంతుడు అభినేత (కారణుడు) మానవుడు నిమిత్త మాత్రుడు.

ఉదా:– మహమ్మద్ ప్రవక్త సందర్భములో ఒక విశిష్ట సంఘటనము.

మహమ్మద్ ప్రవక్త "బదర్" యుద్ధములో శత్రువుపై ఒక గుప్పెడు మట్టి జిమ్మి అల్లరి మూకలను ఓడించి తరిమివేసెను.

బాహ్యమునకు, మహమ్మదుప్రవక్త మానవునిగా శత్రువుపై దుమ్ము చల్లినట్లు కనిపించినను వాస్తవమునకు భగవంతుడే మహమ్మదు ప్రవక్తగా శత్రువుపై దుమ్ము చల్లెను. మహమ్మదు మానవునుగా శత్రువును ఓడించి తరిమివేసెను.

733. సద్గురువు మహిమలు చేయుటలో :– మానవుడు అభినేత (కారణుడు) భగవంతుడు నిమిత్త మాత్రుడు.

ఉదా. షామ్స్ – ఏ – తాబ్రిజ్ అను సద్గురువు మృతులను బ్రతికించుటలో ఒక సంఘటనము. మృతి

నొందిన ఒక రాకుమారుని బ్రతికించుటలో "దేవుని పేరుతో లెండి" అని పిలిచెను. రాకుమారునకు ప్రాణము రాలేదు. అప్పుడతడు "నా పేరుతో లెండి" అని పిలిచెను. వెంటనే రాకుమారుడు బ్రతికెను.

ఇచ్చట సద్గురువు మానవుడుగా ఆజ్ఞాపించెను. భగవంతుడు షామ్స్ గా ప్రాణ విశేషముతో మూర్తీభవించి రాకుమారునికి ప్రాణము పోసెను. ఇచ్చట మానవుడు కారణుడు భగవంతుడు నిమిత్తమాత్రుడు.

## పంచ గోళములు

734\. 1. భౌతికగోళము
2. సూక్ష్మగోళము
3. మానసిక గోళము
4. సంయుక్తగోళము
5. సత్యగోళము

(1–4: పరస్పర సంబంధ గోళములు)

735\. భౌతిక గోళము ( 37 వ పేజీ చూడుడు)
సూక్ష్మ గోళము ( 99 వ పేజీ చూడుడు)
మానసిక గోళము ( 118 వ పేజీ చూడుడు)
సంయుక్త గోళము :-

ఇది 21 అంతర్గోళములతో కూడియున్నది. ఒక అర్థములో ఇదియొక గోళము. మరియొక అర్థములో అసలు గోళమే కాదు.




736.

| | |
|---|---|
| 1. భౌతికగోళము + సంయుక్తగోళ మండలి భాగము | అన్నభువనము |
| 2. సూక్ష్మగోళము + సమగ్రగోళ మండలి భాగము | ప్రాణభువనము |
| 3. మానసిక గోళము + సమగ్రగోళమండలి భాగము | మనోభువనము |

ఆధ్యాత్మిక జీవితముయొక్క-

నాల్గు దశలు

737. 1. ధర్మశాస్త్రమార్గము (కర్మకాండ మార్గము)
2. ఆధ్యాత్మిక మార్గము.
3. ఐక్య మార్గము.
4. అనుభవ మార్గము.

పై నాల్గు దశలును అక్రోటు పండుతో పోల్చ వచ్చును.

738. 1. అక్రోటుపండుయొక్క పై చర్మము లేక తొక్క, కర్మకాండ వంటిది.
2. దానిలోపలి పొర ఆధ్యాత్మికమార్గము వంటిది.
3. దానిలోపలనున్న గుజ్జు ఐక్యము వంటిది.
4. గుజ్జులోపలి సారము అనుభవము వంటిది.

ఈ నాల్గును పరాస్పరాశ్రితములై యున్నవి.

739. ఆత్మ నాల్గు స్థితులద్వారా పురోగమించగా సత్య సంబంధమగు నిత్య సత్యానుభూతిని సేకరించును.

740. చతుర్విధ

నిశ్చయార్థకములు

1. అంతరానుభూతులనుండి, దృశ్యములనుండి లేక ఆధ్యాత్మిక అనుభవములనుండి (అవి మార్గ మందలి అనుభవములు కానీ లేక అన్యము కానీ) కలిగిన నిస్సంశయము,

2. సాక్షీభూతమైన నిస్సంశయము. సర్వత్రా భగవంతుని ప్రత్యక్షముగా చూచుటవలన కలిగిన నిస్సంశయము.

3 భగవదైక్యము వలన కలిగిన నిస్సంశయము.

4. మానవునిలోగల దివ్యత్వపరిపూర్ణత్వమునకు సంబంధించిన అనుభవముతో కూడిన నిస్సంశయము. దీనివలన ఆతడు భగవంతునియొక్క, విశ్వముయొక్క రహస్యములను ఎఱుంగును. ఈశక్తి ఒక్క సార్వభౌమిక మనస్సునకే (మహాకారణ శరీరము) గలదు. ఇది సమస్త దివ్య విచారమునకు పీఠము.

ధృఢ విశ్వాసములు

741. 1. బావిని త్రవ్వగనే, ఇచ్చట మంచినీరున్నదని భావించుటయు, భూమిని త్రవ్వుకొనుచు లోపలికి చొచ్చుకొని పోవుటయు మొదటి విశ్వాసము.

2. నీటిని కన్నులార చూచుట రెండవ విశ్వాసము.

3. నీటిని రుచి చూచుట మూడవ విశ్వాసము.

4. ఆ నీటినిగూర్చి ఇతరులకు వర్ణించి చెప్పుట నాల్గవ విశ్వాసము.

742. అయిదు విధములైన జ్ఞానము

1. ప్రాపంచిక జ్ఞానము (96 వ పేజీ చూడుడు)

2. ధర్మశాస్త్ర జ్ఞానము (96 వ పేజీ చూడుడు)

3. ఆధ్యాత్మికజ్ఞానము
దార్శనికులజ్ఞానము } (106 వ పేజీ చూడుడు)

4. బ్రహ్మజ్ఞానము (136 వ పేజీ చూడుడు)

5. విశ్వ విజ్ఞానము
సర్వజ్ఞత్వము | (156 వ పేజీ చూడుడు)
(అవతార పురుషుని దివ్యజ్ఞానము)

హాల్ – ముకామ్

743. హాల్ అనుపదమునకు సాధారణ అర్థము అంతరానుభవము.

744. మొదటి భూమిక నుండి ఆరవభూమిక వరకు 'హాల్' ఆయా ఉనికికి సంబంధించి యుండును.

745. ఈ అంతరికానుభవము హార్దోన్మత్తతతో కూడి యుండును. ఈ హార్దోన్మత్తత స్వాధీన ముందుండును. స్వాధీనములో లేక యుండును.

746. ప్రత్యేక అర్థములో హాల్, దివ్య హార్దోన్మత్తత, ఇది. అది నిలిచియున్న స్థానబలిమిని బట్టి తర తమ భేదములలో అనుభవింపబడు చుండును.

హాల్ = భావము.
ముకామ్ = స్థానము.

747. బాటసారి ఒక ప్రత్యేక ఆంతరికానుభవములో, ఒక ప్రత్యేక భూమికలో ఆగిపోవుటకు ముకామ్ అందురు.

748. హాల్, ముకామ్ ఈ రెండును ఆరవభూమిక వరకు జంటగా నుండును. హాల్, ఎల్లప్పుడును 'ముకామ్' ను తన ఆధీన మందుంచుకొనును.

749. ఏడవ భూమికలో హాల్ ముకామ్‌లకు తావులేదు, ఉండదు.

750. హాల్ – ఉన్నచోటనే ద్వైతముండును. సప్తమభూమిక నుండి సామాన్య చైతన్యస్థాయికి క్రిందికివచ్చి, ధర్మ నిర్వహణకై ఏదేనిభూమికయందు ప్రతిష్ఠితుడైనప్పుడు ఆ ప్రత్యేక భూమిక ఆతనికి "ముకామ్" అగును.

## స మీ క్ష

751. ఆత్మలన్నియు అపరమాత్మలో
ఉండెను,
ఉన్నవి,
ఉండును.

752. ఆత్మలన్నియు ఒకటే.
అన్ని ఆత్మలు ఒక్కటే.

753. ఆత్మలన్నియు అనంతమైనవి.
శాశ్వతమైనవి.
నిరాకారమైనవి.

754. ఆత్మలన్నియు వాటి జీవనములో ఉనికిలో ఒకటిగనే యున్నవి. కాని ఆత్మలలో వ్యత్యాసము లేదు.

స మా ప్తం

755. కానీ—

ఆత్మలయొక్క—
చైతన్యములో,
ప్రపంచానుభవములో,
భూమికలలో,
బంధములలో,
స్థితిలో,
తాదాత్మ్యతలో-మాత్రము

వ్యత్యాసములున్నవి. ఈ వ్యత్యాసములు గల అత్మలన్నియు పరమాత్మలోనే యున్నవి.

756. ఆత్మలన్నియు ఒక్కటే అయినప్పుడు, అవి యన్నియు పరమాత్మలోనే యున్నప్పుడు, వీటిలో ఇన్ని వ్యత్యాసము లుండుటకు గల కారణమేమి ?

757. వివిధమైన, వేర్వేరు సంసారములే, కారణము.

758. ఆత్మ, ఎట్టి సంస్కారములను కలిగియున్న, అట్టి వాటి కనుగుణ్యమైన శరీరముయొక్క చైతన్యమునే కలిగియుండి, ఆయా ప్రపంచాను భవమును పొందు చుండును.

| | | | |
|---|---|---|---|
| 759. స్థూల సంస్కారములు | అన్నమయ దేహ చైతన్యం | భౌతిక ప్రపంచాను భవము | |
| సూక్ష్మ సం॥ | ప్రాణమయ దేహ చైతన్యం. | సూక్ష్మ॥ | |

మానసిక సం॥ మనోమయదేహ మనోమయ॥
చైతన్యం.

760. ఆత్మ ఎట్టి సంస్కారములను కలిగియున్న, అట్టి వాటి కనుగుణ్యమగు శరీరముతో తాదాత్మ్యతచెంది, ఆ శరీరమునే తానని భావించును.

761. సంస్కారముల కారణముననే, ఆత్మ, శరీరములే తాననెడి భావమును పొందుచున్నది ఈఅజ్ఞానమునకు కారణము, సమస్త అనుభవములకు కారణము, ఈ సంస్కారములే.

సమాప్తం

762. ఆత్మయొక్క చైతన్యము, ఎట్టి సంస్కారములయందు చిక్కువడి యుండునో, అట్టివాటి కనుగుణ్య శరీరములు ద్వారా, ఆ సంస్కార అనుభవమును పొందితీర వలసినదే.

763. ఆత్మకు — స్థూల -
సూక్ష్మ -
కారణ దేహములు-ప్రతిబింబములు.

764. స్థూల —
సూక్ష్మ -
కారణ దేహములు - పరిమితిగలవి,
రూపముగలవి,
నశ్వరమైనవి.

765. ముల్లోకములు – అయదార్థములు,
ఆభాసములు,
కల్పితములు,
స్వప్నతుల్యములు

766. ఆత్మ, స్థూలరూపముల ద్వారా, భౌతిక ప్రపంచానుభవమును పొందుచున్నప్పుడు, అసంఖ్యాక రూపములతో సహచరించు చుండును. దీనినే జననము అందురు.

767. ఆత్మ, స్థూలరూపముల ద్వారా భౌతిక ప్రపంచానుభవమును పొందుచున్నప్పుడు, అసంఖ్యాకరూపముల నుండి వియోగ మందుచుండును. దీనినే మరణము అందురు.

768. ఆత్మ, భౌతిక ప్రపంచానుభవమును పొందుచున్నప్పుడు జనన – మరణములు, కష్ట – సుఖములు పుణ్య – పాపములు మొదలైన ద్వంద్వ అనుభవములు అన్నింటిని, యీ స్థూలరూపమే పొందుచున్నది.

769. ఆత్మకు స్థూలరూపము నీడ వంటిది. పరమాత్మకు భౌతిక ప్రపంచము నీడవంటిది.

సమాప్తం

770 ఆత్మ పొందుచున్న అనుభవములన్నియు తననీడ యైన స్థూలరూపానుభవములే కాని, ఆత్మకు ఎట్టి అనుభవము లేదు.

771. భౌతిక ప్రపంచము పరమాత్మకు ఛాయ కాబట్టి, ప్రపంచానుభవములన్నియు, అయదార్థమైనవి.

772. రూపములేనిఆత్మ;
జనన మరణములు లేని ఆత్మ;
అనంతమైన ఆత్మ;
శాశ్వతమైన ఆత్మ;
కష్ట - సుఖములు
సుఖ - దుఃఖములు మొదలైన
ద్వంద్వములకు అతీతమైన ఆత్మ

తనకు —
రూపమున్నదనియు,
జనన - మరణములు పొందుచుంటిననియు,
కష్ట - సుఖములు
పుణ్య - పాపములు పొందుచుంటిననియు,
పరిమితమైన దానననియు,
అనిత్యమైన దాననినియు గల
అనుభవమును పొందుటకు
సంస్కారములే కారణము.

ఈ అజ్ఞానమునకు కూడా సంస్కారములే కారణము. ఈ ద్వంద్వ అనుభవములన్నియు స్థూల రూపమే పొందుచున్నది.

773. అనంతుడు, శాశ్వతుడు, నిరాకారుడు అయిన భగవంతుడు తన మిథ్యాస్థితులలో సృష్ట్యాదినుండి ఆరవ భూమికవరకు తన స్వీయసృష్టి వలన-

a సంస్కార భూయిష్టుడై తొలిగా స్థూలరూపముల చైతన్యమును పొంది, భౌతిక ప్రపంచానుభవమును సంపాదించెను.

b అట్లే సూక్ష్మ రూపముల చైతన్యమును పొంది సూక్ష్మ ప్రపంచానుభవమును పొందెను.

c మానసిక రూపముల చైతన్యమును పొంది మనోమయ ప్రపంచానుభవమును పొందెను.

d చివరకు అనంత పరమాత్మయొక్క చైతన్యమును పొంది తన శాశ్వతస్థితియొక్క అనుభవమును పొందెను.

e మానవ రూపములో "నేను భగవంతుడను" అనెడు సర్వోన్నతావస్థానమును చేరుకొని, పరమ సత్యానుభూతిని బడయుటయే జీవిత గమ్యము.

f ఆదిలో ఆత్మ, తనయందు ఎఱుక లేకుండెను. మధ్యలో జీవాత్మయై, దేహములయందు ఎఱుకకలిగి వాటితో తాదాత్మ్యమును పొంది దేహములే తానని భావించెను. అంత్యములో తనయందు పూర్తి ఎఱుకను కలిగి, తానే పరమాత్మ అయ్యెను. అనుభవపూర్వకమైన యీసత్యస్థితి, భూతలముమీద మానవరూపములలో భగవంతుని నాల్గు వేర్వేరు దివ్య ఉన్నత స్థాయిలుగా వ్యక్తమగుచుండును.

| | | |
|---|---|---|
| 1. మజ్ జూబియత్: | బ్రహ్మీభూతుడు (విదేహముక్తుడు) | సృష్టిలో కర్తవ్యము లేదు. |
| 2. తురీయావస్థ: | జీవన్ముక్తుడు (పరమహంస) | లేదు. |
| 3 సులూకియత్: | సలీక్ | లేదు. |
| 4. సతుబీయత్: | సద్గురువు | (దివ్యాధికారి) |

## భగవంతుడు

774. "భగవంతుడు అనిర్వాచ్యుడు (ఇట్టివాడని చెప్పశక్యము కానివాడు)

భగవంతుడు నిర్వివాదాంశుడు (వాదోపవాదములచే తెలియబడువాడుకాడు)

భగవంతుడు సిద్ధాంతీకరింపబడడు.
భగవంతుడు చర్చలవలన తెలియబడడు.
భగవంతుడు అగ్రాహ్యుడు (బౌద్ధిక ప్రజ్ఞచే అవగాహనము కానివాడు)

ప్రేమద్వారా మన అహంభావములను వానిలో కోల్పోవుట వలన బ్రతుకులో మాత్రము అనుభవనీయుడు"

775. యథార్థమేమనగా :—
సత్యమును అనుభవింప వలెను.
భగవంతుని దివ్యత్వమును పొందవలెను.
దివ్యత్వములో బ్రతుకవలెను.
ఇదియే సత్యధర్మము.

"భగవంతుడు —

ప్రతిచోటనుండి
సమస్తమును చేయుచున్నాడు.

భగవంతుడు —

మనలోనుండి
సమస్తమును తెలిసికొనుచున్నాడు.

భగవంతుడు —

మనకు వెలుపలనుండి
సర్వమును చూచుచున్నాడు.

భగవంతుడు —

మనకు ఆవలనుండి
సర్వము తానై యున్నాడు."

— మెహెర్ బాబా

# ఆరతి

రాగము : హిందూస్థానీతోడి　　　　　తాళము : చతురశ్ర

"జహాఁ కల్పనా శబ్ద్ న పహుంచే
ఐసే అపరంపార్
నేతి నేతి వేదపుకారే,
మహిమాఁ తోరీ అపార్."

దివ్యసనాతన పరమదయాధన హేజగదుద్ధారో
మే హే ర్ మన్ ఆరతి స్వీకారో .... ॥మె॥

1. ధూప్ దీప్ చందన చర్చానా
భోగ్ లగానా ఫూల్ చఢానా
తుమరా హి తుమ్‌కో లౌటానా
కాహే బడాఈ కరనాఁ ॥మె॥

2. సకల నిధీకే తుమ్ కారణ్ హో
సకల విశ్వ తారణహారే హో
తుమ్ సమ ఔర్ నహీఁ తుమ్ హీ హో
హే సత్ అవతారో — ॥మె॥

3. సకల చరాచర తుమరీ మాయా
మాయా భీ తో తుమ్‌రీ ఛాయా
తుమ్‌రా అంత్ న కోయీ పాయా
తుమ్హే అనంత్ ఖరో — ॥మె॥

4. అప్నే కో జబ్ జో సహీం జానే
మహిమా తుమ్కీ క్యా పహిచానే
జో కుచ్ భీ కహతే అన్జానే
గుణ్ గాతే తుమ్హారో — ॥మో॥

5. సీమా నాహీం తుమరీ కృపా కో
క్యా కోఈ దే సక్తా ప్రభు తుంకో
భీఖ్ తుంహీ దో ప్రేమీజనోంకో
నిత్యతుంహ్మే సుమరో — ॥మో॥

రచన :

శ్రీ మధుసూదన్ పుండరీధర్, (పూనా).

---

'ఆరతి' గ్రామఫోన్ రికార్డు బడయుటకు
ఎడ్రస్ :

శ్రీ ఆది కే. ఇరానీ,
మెహెర్ పబ్లికేషన్స్,
కింగ్స్ రోడ్;
అహమ్మద్నగర్ (మహారాష్ట్ర).

## మంగళగానము

మెహెర్ మెహెర్ గాతే చలో,
మెహెర్ మెహెర్ గాతే చలో,

కామ్ కర్‌తే చలో,
నామ్ జప్‌తే చలో,
సత్య కహాతే చలో,
ఝూఠ్ త్యజతే చలో,

మెహెర్ ధన్ కా ఖజానా బఢాతే చలో ॥మె॥
సుఖ్ మే భూలో నహీఁ,
దుఃఖ్ మే భూలో నహీఁ,
ముస్కురాతే చలో,
హాఁస్‌తే గాతే చలో,

ప్రేమ జీవన్ కే ధారా బహాతే చలో ॥మె॥
జిస్ మే మెహెర్ నహీఁ,
వో తో జీవన్ నహీఁ,
"మై" మిటాతే చలో,
"మై" మెహెర్ మే చలో,
ప్రేమ జన్ హారా మెహెర్ మే సమాతే చలో ॥మె॥

రచన

శ్రీ మధుసూదన్ పుండరీధర్ (పూనా)

Notes : — 'మై' = Self, పరిమిత అహంభావము.

